

# చందమామ

ఫిబ్రవరి - మార్చ్ 1998






విడిప్రతి : 6.00
సంవత్సర చందా : 72.00



## WITH REGRET

A major breakdown in the printing machine disrupted the process of printing and production of the entire chain of magazines of the Chandamama group of publications. We are, therefore, obliged to **combine the February and March** issues of our periodicals. We regret the inconvenience caused to our readers, distributors, and advertisers.

**-PUBLISHER**

Statement about ownership of CHANDAMAMA (Telugu)
Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. *Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 |
| 2. *Periodicity of Publication* | MONTHLY<br>Ist of each calendar month |
| 3. *Printer's Name* | B.V.REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 |
| 4. *Publisher's Name* | B.VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 |
| 5. *Editor's Name* | B.NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 |
| 6. *Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY 2. SRI B.V. NARESH REDDY<br>3. SRI B.V. SANJAY REDDY 4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI 6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA 8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA<br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Chennai - 600 026 |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

B. VISWANATHA REDDI
*Signature of the Publisher*

2nd March 1998




# చందమామ

సంస్థాపకుడు: 'చక్రపాణి' సంచాలకుడు: బి. నాగిరెడ్డి

## ఆఖరి విలుకాడు!

అసమాన ధైర్యం, అమాయకత్వం నిండిన అడవి వీరులు సంథాలులు—ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా జరిపిన తిరుగుబాటు గురించి గత సంచికలలో చెప్పుకున్నాం. వారిలో ఒకడైన ఒక వృద్ధుడి వీరగాథను ఇప్పుడు తెలుసుకుందాం:

ఒకనాడు బ్రిటిష్ సైనికులు అరణ్యమధ్యంలోని సంథాలుల గూడెంకేసి బయలుదేరారు. వాళ్ళు గూడాన్ని సమీపిస్తూండగా వాళ్ళకేసి అసంఖ్యాకంగా బాణాలు దూసుకురాసాగాయి. అవన్నీ కూడా ఒకే గుడిసె నుంచి రావడం గమనించిన బ్రిటిష్ సైనికులు ఆ గుడిసెను చుట్టుముట్టి, గోడ చుట్టూ కన్నాలు పొడిచి వాటి గుండా తుపాకులు పేల్చారు. గుడిసె లోపల ఉన్న వాళ్ళను లొంగిపొమ్మని సైనిక దళ నాయకుడు హెచ్చరించాడు. మళ్ళీ బాణాలు దూసుకు వచ్చాయి తప్ప, ఒక్కరూ వెలుపలికి రాలేదు. తుపాకీ కాల్పులు జరిగాయి. కొంతసేపటికి బాణాలు తగ్గుతూ వచ్చాయి. ఆఖరికి ఒకే బాణం రాసాగింది. సైనికులు మళ్ళీ తుపాకులు పేల్చారు. బాణం రావడం ఆగిపోయింది.

బాణాలు రావడం సాంతం ఆగిపోయాక సైనికులు తలుపులు పగులగొట్టి లోపలికి ప్రవేశించారు. శవాల మధ్య ఒక వృద్ధుడు నిలబడి ఉన్నాడు. ఆఖరి బాణం వదిలిన వాడు ఆ వృద్ధుడే! అతని కుడిచేయి తుపాకీ తూటాలకు గాయపడి నెత్తురు కారుతున్నది. "లొంగిపో!" అని హెచ్చరిస్తూ దళనాయకుడు అతన్ని సమీపించాడు. అంతే! మరుక్షణమే వాడి తల తెగి నేలపై బడింది! వృద్ధుడి కుడి చేయి గాయపడిందే తప్ప, ఆయన ఎడమ చేయి బాగానే ఉన్నది. ఆ చేతిలోని కత్తితోనే శత్రువు తలను నరికాడు! వెంటనే సైనికుల తుపాకీ గుళ్ళు వృద్ధుడి శరీరాన్ని తూట్లు చేశాయి. ఆయన నేలకు ఒరిగి తన వాళ్ళ శవాల మధ్య శవంగా కలిసిపోయాడు. అంతటితో సంథాలుల తిరుగుబాటు కూడా దాదాపు అంతమయింది!

సంపుటి: 101 ఫిబ్రవరి—మార్చ్ '98 సంచిక: 2

విడిప్రతి : 6.00 సంవత్సర చందా 72-00



వార్తలు-విశేషాలు:

# బూకర్ బహుమతి పొందిన భారతీయ రచయిత్రి

అరుంధతీరాయ్ రచించిన "ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్" అనే నవలకు ప్రతిష్ఠాత్మకమైన బూకర్ బహుమతి లభించింది. ఇంగ్లాండు, ఐర్లాండుతో సహా దాదాపు యాభై కామన్వెల్త్ దేశాలలో 1997వ సం॥లో ప్రచురింపబడిన దాదాపు 106 నవలలలో 'ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' ఉత్తమమైనదిగా ఎంపికయింది. అంతేకాదు; అరుంధతీరాయ్ రచించిన మొట్టమొదటి నవల కూడా ఇదే కావడం మరొక ఆసక్తికరమైన విశేషం!

అరుంధతీరాయ్ ముప్పై యేడేళ్ళ క్రితం కేరళ రాష్ట్రం, కోట్టయం జిల్లా అయామనం గ్రామానికి చెందిన పులియంపళ్ళిల్ కుటుంబంలో జన్మించింది. ఆమె తాత జాన్ కురియన్ ఇంజనీరుగా ప్రభుత్వోద్యోగం చేసి, ఉద్యోగ విరమణ తరవాత క్రైస్తవ మత ప్రచారకుడుగా రెవరెండ్ ఫాదర్ కురియన్‌గా ఆ ప్రాంతంలో పేరు గాంచాడు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఆయన్ను 'రావుబహదూర్' బిరుదుతో సత్కరించింది. అరుంధతి తండ్రి షిల్లాంగులో తేయాకు తోటల యజమాని. ఆమె అక్కడే జన్మించింది. ఆమె ప్రాథమిక విద్య అయామనంలోనే ఆరంభమయింది.



అరుంధతి చిన్నప్పటి నుంచీ ప్రకృతి పరిశీలన పట్ల అమిత ఆసక్తిని కనబరచేది. సహజ సుందరమైన ప్రకృతి దృశ్యాలకు పేరుగాంచిన కేరళ భూమి ఆమె లోని సౌందర్య దాహాన్ని మరింత పెంచింది. ఆమె నవలలోని ప్రకృతి వర్ణనలలో ఇది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

'ఆర్కిటెక్చర్' ప్రధాన పాఠ్యాంశంగా ఆమె ఉన్నత విద్యనభ్యసించినప్పటికీ ఆ వృత్తిపట్ల ఆమెకు ఆసక్తి తగ్గిపోయింది. ఆమె దృష్టి రచనా వ్యాసంగం వైపు మళ్ళింది. సినిమా రచన చేయడం మొదలు పెట్టింది. ఆమె రచనల నుంచి మూడుచిత్రాలు రూపొందాయి. ఆ మూడు చిత్రాలలోనూ ఆమె ముఖ్యమైన పాత్రలలో నటించింది.

ఆ తరవాత ఆమె చిత్రరచనకు స్వస్తి చెప్పి, నవలకు తగిన చక్కటి కథావస్తువు స్ఫురించడంతో నవలా రచనకు పూనుకున్నది. ఐదేళ్ళలో నవలను పూర్తిచేసింది!

ఆమె తల్లి మేరీరాయ్, "చిన్నప్పటినుంచే అరుంధతి ఉపాధ్యాయులు సైతం ఆశ్చర్యపడేలాగా ఎప్పుడూ చదువుతూ ఉండేది. ఆమెకు పుట్టినరోజు కానుకగా ఒక టైప్‌రైటర్ కొనిపెట్టాను. ఆ తరవాత కొన్నాళ్ళకు ఆమె 'డెస్క్ టాప్ కంప్యూటర్'ను కొనుక్కున్నది. అందులోనే 'ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' టైపు చేయడం జరిగింది," అన్నారు.

ఈ నవల—కవల పిల్లలయిన ఒక అబ్బాయి, అమ్మాయి—వాళ్ళ కుటుంబం, పెరిగిన సమాజం చుట్టూ నడుస్తుంది. వాళ్ళ ఏడేళ్ళ ప్రాయం నుంచి నవల ఆరంభమవుతుంది. కథాస్థలం అయామెనం. కథాకాలం 1960 ప్రాంతం. అరుంధతి తన జీవితంలో తారసపడిన వ్యక్తులనే నవలలోని ముఖ్యమైన పాత్రలుగా చిత్రించింది!

నవల పూర్తయ్యాక అరుంధతి దానిని ఇంగ్లాండులోని ప్రచురణా సంస్థల ప్రతినిధులకు చూపెట్టింది. దానిని ప్రచురించడానికి ఒకరితో ఒకరు పోటీపడ్డారు. ఆఖరికి మూడు కోట్ల రూపాయల పారితోషికం చెల్లించి హార్పర్స్ కోలిన్స్ ప్రచురణా సంస్థ గత ఏప్రిల్ నెలలో దానిని ప్రచురించింది. బూకర్ బహుమతికి ఎంపిక అయ్యే నాటికే ఈ నవల ప్రపంచం మొత్తం మీద 35,000 ప్రతులు అమ్ముడయ్యాయి. పదిహేను ప్రపంచ భాషలలోకి అనువదించబడింది. ఇప్పుడు మరొక 20 భాషలలోకి అనువదించబడుతున్నది. బూకర్ సంస్థ దీనికి 12.5 లక్షల రూపాయల బహుమతిని అక్టోబర్ 14వ తేదీ ప్రకటించింది!

పాతికేళ్ళ క్రితం ఏర్పాటు చేసిన బూకర్ బహుమతిని అందుకుంటూన్న భారతీయులలో అరుంధుతీ రాయ్ నాలుగవ వారు. 1987వ సం॥లో సాల్మన్ రుష్డీ (మిడ్ నైట్స్ చిల్డ్రన్), 1975వ సం॥లో రూత్ ప్రవేర్ జాబ్‌వాలా (హీట్ అండ్ డస్ట్), 1971వ సం॥లో వి.ఎస్. నైపాల్ (ఇన్ ఫ్రీ స్టేట్) బూకర్ బహుమతి పొందారు. భారతీయ సంతతికి చెందిన ఈ ముగ్గురూ బూకర్ బహుమతి అందుకోవడానికి పూర్వమే రచనా రంగంలో సుప్రసిద్ధులు. అయితే అరుంధతీ రాయ్ తన మొట్టమొదటి నవలకే ఈ బహుమతిని అందుకోవడం ప్రశంసనీయమైన విషయం!

తనకు లభించిన బహుమతిని గురించి ఆమె అభిప్రాయాన్ని అడిగిన వారితో అరుంధతీరాయ్ నవ్వుతూ, "అది ఉత్తమమైన నవల కాదు; మిగతా వాటికన్నా అదృష్టకరమైన నవల," అన్నదట!



# పితృభక్తి

సుదర్శనం తలతిక్కమనిషి. తనకు తోచింది చేయడమే తప్ప పెద్దలు చెప్పింది వినాలనుకోడు. ఇది సుదర్శనం తండ్రి ప్రభాకరానికి చాలా బాధగా వుండేది.

ప్రభాకరం తెలివైనవాడూ, మంచివాడూ కూడా! కానీ ఆయన కూడా తలతిక్క మనిషి. ఆయన పోలికే కొడుక్కు వచ్చిందని అంతా అంటారు.

"నేను తలతిక్క మనిషినే అయినా, సంప్రదాయాన్ని పాటిస్తాను. నాకు పితృభక్తి ఎక్కువ. నేనీ రోజున పచ్చగా వున్నానంటే, అందుకు నా పితృభక్తి మాత్రమే కారణం. నా అనుభవం నా కొడుకు కూడా పంచుకుంటే ఎంతో బాగుండును!" అని ప్రభాకరం బాధపడేవాడు.

సుదర్శనానికి ఒకరి అనుభవం నుంచి నేర్చుకొనడం ఇష్టముండదు. ఏదైనాసరే స్వానుభవం వల్లనే తెలుస్తుందని వాడంటాడు. బాగా చిన్నప్పుడు నిప్పు కాలుతుందంటే, ముట్టుకునేదాకా వాడు నమ్మలేదు. కాస్త పెరిగి పెద్దయ్యాక, ఊరి చెరువులో మొసలి చేరిందంటే, అందులో స్వయంగా ఈతకొట్టి, చావు తప్పి కన్ను లొట్టపోయిన పరిస్థితి తెచ్చుకున్నాడు.

అయితే, సుదర్శనం తలతిక్క వల్ల కొంత మేలు జరిగింది. ఆ ఊళ్ళో సీతమ్మ అనే విధవరాలు ఒకర్తే ఒక పెద్ద ఇంట్లో వుండేది. కొంత కాలానికి కాలం తీరి ఆవిడ చనిపోయింది. ఆమె దూరపు బంధువు ఆ ఇంటిని అమ్మాలనుకుంటే, ఆ ఇంట్లో సీతమ్మ దయ్యం తిరుగుతున్నదని ఊళ్ళో పుకారు పుట్టింది. దూరపు బంధువు ఇంటిని చాలా తక్కువ ధరకే అమ్ముదామన్నా, కొనడానికి ఒక్కరూ ముందుకు రావడం లేదు. సుదర్శనం ఆ ఇల్లు

"వసుంధర"

కొందామంటే తండ్రి ఒప్పుకోలేదు. అప్పుడు వాడా ఇంట్లో మూడు రాత్రులు ఒంటరిగా నిద్రపోయి వచ్చి, దయ్యాలు లేవని నిరూపించాడు. తండ్రిచేత ఆ ఇల్లు కొనిపించాడు.



కొడుకు వల్ల మేలు జరిగిందని ప్రభాకరం చాలా సంతోషించాడు. కానీ అప్పట్నించీ సుదర్శనం, తండ్రి మాటను బొత్తిగా లెక్కచేయడం మానేశాడు.

ప్రభాకరానికి పదెకరాల పొలమున్నది. సమర్థవంతంగా వ్యవసాయం చేస్తాడు. కొడుకు చేతికి అందొస్తే, ఆయన ఆ పొలాన్ని ఇరవై ఎకరాలు చేసి పెద్ద భూస్వామి కావాలనుకుంటున్నాడు.

అయితే, సుదర్శనం ఆలోచనలు వేరే ఉన్నాయి. వ్యవసాయంలో ఎంత కష్టపడ్డా ఎదుగూ బొదుగూ వుండదు! అదే వ్యాపారంలో అయితే, ఏడాది తిరిగేలోగా లక్షలార్జించి రంగరంగ వైభోగంగా జీవించవచ్చు! అందుకని, వాడు ఒకనాడు తండ్రితో కొంత పొలం అమ్మేసి వ్యాపారానికి పెట్టుబడిగా ఇస్తే, పెద్ద ఎత్తున వ్యాపారం ప్రారంభిస్తానని చెప్పాడు.

దానికి ప్రభాకరం వాడితో, "నాయనా! వ్యాపారం మన కుటుంబానికి అచ్చిరాదు. మనం కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడతాం. నీతినీ, నిజాయితీనీ నమ్ముకుంటాం. వ్యాపారమంటే ఎంతో కొంత మోసం చేయాలి. ఎన్నో కొన్ని అబద్ధాలు చెప్పాలి. లేకుంటే అందులో రాణించలేము. వ్యవసాయమైతే నీకు, నా అనుభవం కూడా అక్కరకు వస్తుంది," అంటూ హితవు చెప్పాడు.

తండ్రి మాటలకు సుదర్శనం నవ్వి, "అవసరం అయితే వ్యాపార లక్షణాలన్నీ నేర్చుకుంటాను. వ్యాపారంలో రాణించడం కోసం ఏమైనా చేస్తాను. ఇక మీ అనుభవమంటారా? దాని అవసరం నాకు లేదు. వ్యవసాయం చేసినా, నేను మీ అనుభవాన్ని ఎలాగూ ఉపయోగించుకో దలచుకోలేదు. మీకు వ్యాపారానుభవం లేకపోతే నా జోలికి రావద్దు," అన్నాడు తేలికగా.

సుదర్శనానికి తల్లి వత్తాసు పలికింది. తండ్రి మాట మీద బొత్తిగా గౌరవం లేదని, కొడుకు గురించి అనుకుని బాధ పడ్డాడు ప్రభాకరం. అయితే, ఆయనకు



వున్న పొలం అమ్మడం ఇష్టం లేదు. మరొక ఐదెకరాల పొలం కొందామని ఆయన కొంత డబ్బు కూడబెట్టి వుంచాడు. ఆ డబ్బును కొడుక్కిచ్చి, వాడి ఇష్టం వచ్చినట్టు చేసుకోమన్నాడాయన.

సుదర్శనం వ్యాపారం ప్రారంభించాడు. ఆరంభంలో లాభాలు బాగానే వచ్చాయి. అది నిలబెట్టుకునేందుకు వాడు అవినీతికీ, మోసాలకూ, అబద్ధాలకూ పాల్పడవలసి వచ్చింది. ఆ విధంగా ఏడాదిలో వాడు తండ్రి ఇచ్చిన డబ్బును మూడు రెట్లు చేశాడు.

అందుకు ప్రభాకరం ఎంతో సంతోషించి, "నువ్వు చాలా సమర్థుడివి. నిన్ను తక్కువ అంచనా వేశాను. నీకిష్టమైతే మనకున్న పొలాన్నంతా అమ్మేసి, నేను నీ వ్యాపారంలో భాగస్వామిని అవుదామనుకుంటున్నాను," అన్నాడు.

ఇందుకు సుదర్శనం ఏమాత్రం సంతోషించలేదు సరికదా, బాగా చిరాకు పడ్డాడు. వాడు తండ్రితో, "ఊరికే నీతి వాక్యాలు వల్లిస్తావు కానీ, నీకు నీతి కంటే డబ్బే ముఖ్యం. అవినీతి, మోసాలు, అబద్ధాలు మనిషికి డబ్బునిచ్చినా, సంతోషాన్నివ్వలేవని అనుభవంతో తెలుసుకున్నాను. నిజాయితీగా మరొక సంవత్సరం పాటు వ్యాపారం చేసి, అప్పుడు కూడా ఇంత డబ్బు సంపాదించ గలిగితేనే, వ్యాపారం కొనసాగిస్తాను. లేకుంటే వ్యవసాయానికి మారిపోతాను. అంత వరకూ ఎవరినీ భాగస్వాములుగా చేర్చుకునేది లేదు," అని ఖచ్చితంగా చెప్పేశాడు.

కొడుక్కు పితృభక్తి ఏమాత్రం లేదని, ప్రభాకరం భార్యవద్ద బాధపడ్డాడు.

ఏడాది తిరిగేసరికి సుదర్శనానికి వ్యాపారంలో వున్నదంతా పోయింది. వాడిక వ్యాపారం మానేసి వ్యవసాయానికి మారాలనుకున్నాడు.

అందుకు ప్రభాకరం సంతోషించేవాడే కానీ సుదర్శనం, తండ్రి పద్ధతిలో వ్యవసాయం చేయనన్నాడు. వరి పండించే పొలంలో పొగాకు వేస్తాడట. మామిడి తోటలు కొట్టేసి కొబ్బరి మొక్కలు నాటిస్తాడట. ఉన్న తోటను పాడు చెయ్యడమెందుకు? కొత్త పొలం కొని ఆ పని చెయ్యవచ్చునన్నాడు తండ్రి. ఇందుకు సుదర్శనం ఒప్పుకోలేదు.

"ఇలాగైతే మనం సర్వనాశనమై పోతాం," అన్నాడు ప్రభాకరం భార్యతో.

ఆమె పెద్దగా బాధపడకుండా, "అంతా రాసి పెట్టినట్లే జరుగుతుంది. మీరు మాత్రం అబ్బాయి మనసు నొప్పించకండి," అన్నది.

భార్య మాటలు ప్రభాకరానికి నచ్చ లేదు. ఆయన కొడుక్కు నచ్చచెప్పడానికి ప్రయత్నం చేసి చివరకు, "నేను బ్రతి కున్నంత కాలం నా పొలంలో అన్నీ నా ఇష్ట ప్రకారం జరుగుతాయి. కావాలంటే నీ సరదాలు నువ్వు వేరే పొలం కొని తీర్చుకో," అనేశాడు.

సుదర్శనం అందుకు సిద్ధంగానే వున్నాడు. ఆ ఊళ్ళో ప్రకాశం అనే పెద్ద రైతు ఒకాయన వున్నాడు. ఆయనకు నూరెకరాల పొలం వున్నది. ఆయన ఒక్కగానొక్క కూతురు పద్మ, సుదర్శనం రూపురేఖలు చూసి ముచ్చటపడింది. అతన్నే పెళ్ళి చేసుకుంటానని పట్టు బట్టింది. ప్రకాశం, సుదర్శనానికి పదెక రాల పొలం ఇచ్చి, వాడికి తోచిన విధంగా వ్యవసాయం చేసుకోనిస్తాననీ-తన కూతుర్ని పెళ్ళి చేసుకోమనీ అడుగు తున్నాడు.

సంబంధం మంచిదే కానీ, ఇక్కడొక ఇబ్బంది వున్నది. ప్రకాశం, ప్రభాకరం బద్ధ శత్రువులు. వారు ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. అందువల్ల, "నువ్వు నా కూతుర్ని పెళ్ళి చేసుకుంటే, నీ తల్లి దండ్రులతో కలిసి వుండకూడదు. మీరి ద్దరూ వేరు కాపురం పెట్టాలి!" అని షరతు పెట్టాడు ప్రకాశం.

ఎప్పుడైతే తండ్రి తనను వేరే పొలం కొనుక్కోమన్నాడో, ఆ వెంటనే ప్రకాశం కూతురు సంబంధం షరతులు గురించి





ఇంట్లో తన తల్లిదండ్రులకు చెప్పేశాడు సుదర్శనం.

ఈసారి బెంగపెట్టుకోవడం సుదర్శనం తల్లిదయింది. కొడుకు, కోడలు ఇంట వుండి కాపురం చేస్తూంటే, చూసి ఆనందించాలని ఆమె కోరిక. ఇక చేసేది లేక ఆమె, గోపాలస్వామి ఇంటికి వెళ్ళి తన గోడు చెప్పుకున్నది.

ఈ గోపాలస్వామి దూరపువరుసలో ఆమెకు అన్న అవుతాడు. ఆయన వద్ద ఒక మహిమ గల మూలిక వున్నట్టు చెప్పుకుంటారు. దాని ప్రభావంతో ఆయన ఎటువంటి వారికైనా మనసు మార్చగలడు. ఎటొచ్చీ వరుసగా రెండు రోజులు, ఆ మనిషి ఆయన వద్దకు వెళ్ళవలసి వుంటుంది. రెండోసారి వెళ్ళినప్పుడు మాత్రమే మూలిక ఆ మనిషి మీద అసలు ప్రభావాన్ని చూపిస్తుంది.

అంతా విన్నాక గోపాలస్వామి, సుదర్శనం తల్లితో, "చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ, అని పెద్దలూరికే అనలేదు. నువ్వు ఒక్కగానొక్క కూతురి పెళ్ళి చేసి, ఆ కూతురుకు నువ్విచ్చిన సలహా—వెంటనే వేరుకాపురం పెట్టమనేగా! నీ కూతురి అత్తమామల ఉసురే నీకు తగిలింది. నువ్వు మొదట నీ తత్వం మార్చుకుని, నీ కూతుర్ని సరైన దారిలో పెట్టు. నీ కూతురి అత్తమామలు సంతోషిస్తే, అది నీ కుటుంబానికే మేలు చేస్తుంది!" అన్నాడు.

"నేను ఆ విషయాలు మాట్లాడ్డానికి ఇప్పుడు రాలేదు. సుదర్శనానికి బొత్తిగా పితృభక్తి లేకుండా పోయింది. వాడిలో పితృభక్తి పుట్టించమని కోరడానికి వచ్చాను," అన్నది సుదర్శనం తల్లి తెలివిగా మాట మార్చుతూ.

"సరే, అందుకు నా ప్రయత్నం నేను చేస్తాను. అయితే, కూతురి విషయంలో నీ బుద్ధి మారేదాకా, కొడుకు విషయంలో నువ్వు కోరినట్లు జరుగుతుందనుకోకు!" అని గోపాలస్వామి, ఆమెను హెచ్చరించాడు.

సుదర్శనం తల్లి ఆ హెచ్చరికకు అట్టే ప్రాధాన్యతనివ్వకుండా, "మావాడి మనసు మార్చాలంటే, వాడు వరుసగా రెండు రోజులు నీ దగ్గరకు రావాలి కదా! రెండో రోజునే నీ మూలిక వాడి మీద పని చేస్తుంది కదా! అందువల్ల మొదటి

రోజున మావాడి దగ్గర, వాళ్ళ నాన్నను బాగా తిట్టు. అప్పుడే వాడు రెండో రోజున నీ దగ్గరకు వస్తాడు," అని ఉపాయం కూడా చెప్పింది.

"నేనేం చేసినా జరిగేది మాత్రం వాళ్ళ వాళ్ళ బుద్ధుల్ని బట్టే జరుగుతుంది. నా ప్రయత్నం నేను చేస్తాను, వెళ్ళు!" అన్నాడు గోపాలస్వామి.

సుదర్శనం తల్లి ఇంటికి వెళ్ళి, భర్తకు జరిగింది చెప్పి, "ఇక మీరు దిగులు మానండి. త్వరలో అన్నీ సర్దుకుంటాయి," అన్నది.

"ఇంతకాలం వాడికి పితృభక్తి లేక పోయినా, నీకేమీ అనిపించలేదు. వాడే నా కంటే తెలివైనవాడనుకున్నావు. ఇప్పుడు వాడు నీ చేయి కూడా దాటిపోతున్నాడని తెలిశాకమాత్రం బుద్ధి మారింది," అంటూ ప్రభాకరం భార్యను నిష్ఠూరమాడాడు.

"దేనికైనా సమయం అంటూ రావాలి! లేకుంటే మా అన్నయ్య గోపాలస్వామి దగ్గరకు వెళ్ళాలని ఈరోజు నాకు స్ఫురించిందే తప్ప, ఇన్నాళ్ళలో ఒక్కసారైనా మీకు స్ఫురించిందా?" అంటూ ప్రభాకరం భార్య వేదాంతం చెప్పింది.

అప్పుడు భార్యాభర్తలిద్దరూ కూడ బలుక్కుని, కొడుకును పిలిచి, "నాయనా! ఎప్పుడు నీవడిగినా దేనికీ కాదనలేదు. పెళ్ళి విషయంలో కూడా నీ నిర్ణయాన్ని కాదనదల్చుకోలేదు. ఈరోజు నీ మామయ్య గోపాలస్వామి ఇంటికి వెళ్ళి, ఆయన దీవెనలు పొందిరా! ఆ తరవాత మాకే అభ్యంతరమూ వుండదు," అన్నారు ఆప్యాయంగా.



ఏ కళనున్నాడో సుదర్శనం, తల్లిదండ్రుల మాట పాటించి, గోపాలస్వామి దగ్గరకు వెళ్ళాడు. ఆయన వాడిని విషయమంతా అడిగి తెలుసుకుని, "నీ తల్లి మర్యాద లెరిగినది కాదు. కూతురుకు దుర్బోధలు చేసింది. అలాంటి మనిషి కోడల్ని కష్టపెట్టి తీరుతుంది. కాబట్టి, వేరు కాపురం పెట్టాలన్న నీ నిర్ణయం చాలా మంచిది. ఇక నీ తండ్రి సంగతంటావా? ఆయన ఎలాంటివాడో ఊళ్ళో ఎవర్నడిగినా చెబుతారు. అలాంటి తండ్రి వుండీ నీవింత ఉత్తముడివయ్యావంటే, అది పూర్తిగా నీ గొప్పతనం! నీ నిర్ణయం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. వృద్ధాప్యంలో నీ వంటి ఉత్తముడి సేవలందుకునే యోగ్యత నీ తండ్రికి

లేకనే, భగవంతుడు నీలో ఈ నిర్ణయాన్ని కలిగించాడు!" అంటూ ప్రభాకరాన్ని నిందించాడు.

సుదర్శనం అసహనంగా, "ఇదంతా నా కెందుకు? మీనుంచి దీవెనలు పొందమని, నా తల్లిదండ్రులు పంపించారు!" అన్నాడు.

"మీ నాన్నకు సుముహూర్తాల గురించి కూడా తెలియదు. ఆ పెద్దరికమెందుకూ-మండిపోనూ! రేపు ఉదయం మంచి ముహూర్తముంది. అప్పుడు రా, దీవించి పంపుతాను," అన్నాడు గోపాలస్వామి.

సుదర్శనం అక్కడి నుంచి విసురుగా ఇంటికి వెళ్ళాడు. జరిగినదంతా తల్లిదండ్రులకు చెప్పి, "నేను వ్యక్తిత్వమున్నవాణ్ణి. అందువల్ల, అన్నీ నాకు తోచినట్టే చేస్తాను. అయినా, నాకు నా తల్లిదండ్రులంటే ఎంతో భక్తి. నా ముందు నా తల్లిని మాటలంటే పోనీలే అన్న గదా అని సరిపెట్టుకున్నాను. కానీ నా తండ్రిని మాటలంటే ఎలా సహించగలను? అలాంటివాడి దీవెనలందుకోవడం నాకు తగదు. మరోసారి ఆయన దగ్గరకు వెళ్ళమని మీరు నాకు చెప్పకూడదు. అంతేకాదు— మళ్ళీ మీరెన్నడూ—ఆయనతో మాట్లాడకూడదు," అంటూ ఎంతో ఆవేశంగా తన నిర్ణయం చెప్పేశాడు.

అప్పటికి ప్రభాకరానికి అర్థమయింది-తన కొడుక్కు పితృభక్తి వున్నదనీ; అదీ చాలా ఎక్కువ పాళ్ళలో వున్నదనీ! కానీ ఆ పితృభక్తే వాడిని తండ్రి మాట వినకుండా చేయడంతో, ఆ పితృభక్తికి సంతోషించాలో, దుఃఖించాలో తెలియకుండా అయిపోయాడు.

చివరకు గోపాలస్వామి సలహాను గుర్తు చేసుకుని, ప్రభాకరం, ఆయన భార్య తమ తలతిక్కతనాలను తగ్గించుకుని, సత్ప్రవర్తనవైపు దారిని మళ్ళించుకున్నారు. దాంతో, అటు వారి కూతురి కాపురమూ మెరుగైంది, ఇటు ప్రభాకరానికీ, వియ్యంకుడు ప్రకాశానికీ స్నేహభావమేర్పడి, రెండు కుటుంబాలూ ఒకటయ్యాయి.

సుదర్శనం పితృభక్తి మాత్రం ఎప్పటిలాగే కొనసాగుతున్నది. ఇప్పుడా పితృభక్తి తండ్రికి సంతోషాన్నిస్తున్నది.






[బిందుసారుడి మరణానంతరం యువరాజు అశోకుడు — సుశేముడు మొదలుగాగల అంతశ్శత్రువులను హతమార్చాడు. పెద్దల కోరిక ప్రకారం ద్వితీయ వివాహం చేసుకుని, మగధ రాజ్యాభిషిక్తుడయ్యాడు. మంత్రి సేనాధిపతుల ప్రోద్బలంతో కళింగపై దండయాత్రకు సిద్ధమయ్యాడు. మొదటి భార్య విదిశాదేవిని ఉజ్జయినీ నగరం నుంచి రాజధాని పాటలీపుత్రానికి తీసుకురావాలన్న అశోకుడి ప్రయత్నం ఫలించలేదు. కళింగ మీదికి మగధ సైన్యం రావడం చూసి కళింగ పాలకులు, ప్రజలు శత్రుసేనలను ఎదుర్కోవడానికి సిద్ధమయ్యారు. — తరవాత]

మహారాజు అశోకుడు, సేనాధిపతి ఉన్న గుడారానికి వచ్చిన యశుడు, "మనం మెరుపుదాడి జరిపాం. అయినప్పటికీ కళింగ ప్రజలు దృఢంగా ఎదుర్కొంటున్నారు. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం!" అన్నాడు.

"ఇంతకూ ఈ దేశానికి ఇప్పుడు రాజు కూడా లేడు. సామంతులే రాజ ప్రతినిధులుగా పాలనా వ్యవహారాలు చూస్తున్నారు!" అన్నాడు అశోకుడు.

అంతవరకు సైన్యానికి నాయకత్వం వహించిన సేనాధిపతి ఏమీ మాట్లాడలేదు.

"ఇది మిమ్మల్ని విమర్శించడానికి చెప్పడం కాదు. కళింగ ప్రజల ధైర్య సాహసాలు మాకు అమితాశ్చర్యం కలిగిస్తున్నాయి," అన్నాడు యశుడు సేనాధిపతికేసి తిరిగి.

"నాకూ ఆశ్చర్యంగానే ఉన్నది. ఇప్పటివరకూ మనల్ని ఎదుర్కొంటూన్న



వాళ్ళు గ్రామప్రాంతాలలోని సామాన్య ప్రజలే. వ్యవసాయం చేసుకుని బ్రతికే రైతులు ఆపత్సమయంలో, అత్యవసర పరిస్థితులలో కత్తులు బట్టి శత్రువుల మీదికి దాడి వెడలడం ఆ రాజ్యంలో తరతరాలుగా వస్తూన్న సంప్రదాయం. కళింగ సైన్యం పట్ల వాళ్ళెంతో గౌరవం కనబరుస్తారు!" అన్నాడు సేనాధిపతి.

"ప్రతి ఒక్కరూ తమ రాజ్యం కోసం ప్రాణాలు అర్పించడానికి ఏమాత్రం వెనుకాడడం లేదని నేనూ విన్నాను. అది నిజమేనా?" అని అడిగాడు అశోకుడు.

"నిజమే, ప్రభూ!" అన్నాడు సేనాధిపతి.

"అంటే మహా బలోపేతమైన మగధ సేనలను కళింగలోని సామాన్య ప్రజలూ, రైతులూ తమ ధైర్యసాహసాలతో త్రిప్పి గొట్టగలుగుతున్నారన్న మాట! అంతే కదా? నా ప్రథమ దండయాత్రలోనే, నా పరిస్థితి ఎలా పరిణమించిందో చూశారా? పరాజయం పాలుకాకపోయినప్పటికీ, నేను తీవ్రమైన ఆశాభంగానికి గురికావలసిందేనా?" అన్నాడు అశోకుడు ఆవేదన నిండిన ఆగ్రహంతో.

కొంతసేపు అక్కడ గంభీరమైన నిశ్శబ్దం చోటుచేసుకున్నది. హఠాత్తుగా యశుడు కత్తిదూసి, "నా బొందెలో ప్రాణం వుండగా తమకు అటువంటి పరిస్థితి ఏర్పడదు మహారాజా!" అని సేనాధిపతికేసి తిరిగి, "ఎదురుపడ్డ ప్రతి ఒక్కరినీ వివక్షత చూడకుండా హతమార్చమని మన దళ నాయకులనూ, సైనికులనూ ఆజ్ఞాపించండి. ఎదుటి వాళ్ళు యుద్ధానికి ఆయత్త మయ్యేంతవరకు వేచివుండనవసరం లేదు. సాధ్యమైనంత మందిని సాధ్యమైన పద్ధతిలో హతమార్చండి. వాళ్ళ సంఖ్యా బలం తగ్గితేనే కళింగ ప్రజలను జయించ గలం!" అన్నాడు ఆవేశంగా.

రాజు గుడారం ముందు దండోరా శబ్దం వినిపించింది. రాజుకేదో ముఖ్యమైన విషయం తెలియజేయడానికి సైనికులు వచ్చారనడానికి అది సంకేతం.

దూసిన కత్తితోనే గుడారం వెలుపలికి వెళ్ళిన యశుడు, ఒక దళనాయకుణ్ణి వెంటబెట్టుకుని లోపలికి వచ్చాడు.

"తోశాలి కోట పరిసరాలలో యుద్ధం ముమ్మరంగా కొనసాగుతున్నది. ఇప్పటికే మన సైనికులు ఐదువేలమందీ, అంతకు రెండింతలు కళింగులూ హతులయ్యారు. అయితే, ఇక్కడొక ఆశ్చర్యకరమైన

విషయం ఏమంటే ఇప్పటివరకు మన సేనలను ఇంత బలంగా ఎదురొడ్డి యుద్ధం సాగిస్తున్న వాళ్ళు సక్రమంగా శిక్షణ పొందిన సైనికులు కారు. అసలు సైనికులు కోట లోపలే ఉన్నారు!" అన్నాడు దళ నాయకుడు.

"అసలు సైనికులు మన మీదికి ఉరికే లోగా, మన సేనలను సాధ్యమైనంత వరకు బలహీనపరచడమే కళింగుల యుద్ధ వ్యూహం!" అంటూ అశోకుడు తలపంకించి, "ఇక ఆలస్యం చేయడం అనర్థ దాయకం. యశా! మనమే మగధ సేనకు నాయకత్వం వహిద్దాం, పద!" అని ఆజ్ఞాపించాడు.

అందరూ గుడారం నుంచి వెలుపలికి వచ్చారు.



★ ★ ★

యుద్ధభూమికి సమీపంలోని ఒక గ్రామంలో వేలాది మంది కళింగ స్త్రీలు చేరి, పగటిపూట వంటలు వండి, పొద్దు గూకగానే సైనికులకు ఆహారం అంద జేస్తున్నారనీ, క్షతగాత్రులకు చికిత్సలు చేస్తు న్నారనీ చారుల ద్వారా తెలియవచ్చింది. వెంటనే సేనాధిపతి సైనిక దళాలను వెంటబెట్టుకుని స్త్రీలు వంట చేస్తూన్న గ్రామాన్ని చేరుకున్నాడు. సైనికులు గ్రామా న్నంతటినీ అగ్నికి ఆహుతి చేశారు.

అయినా స్త్రీలు ఏమాత్రం భయపడ కుండా మండుతూన్న ఇళ్ళనుంచి కట్టెలను లాక్కుని, శాపనార్థాలు పెడుతూ వాటితో సైనికులను ఎదుర్కొన్నారు. కాని కొంత సేపటికి వాళ్ళందరూ సైనికుల చేతుల్లో దారుణంగా ప్రాణాలు కోల్పోయారు.

ఆ రోజంతా కోట సమీపంలో ఘోర మైన యుద్ధం జరిగింది. ఉభయపక్షాల లోనూ వేలాదిమంది మరణించారు. మరునాడు యశుడు అశోకుడి దగ్గరికి వెళ్ళి నమస్కరించి, "ఒక శుభవార్త మహారాజా! కోటకు ఒక వైపున వున్న బలమైన గోడ కొంచెం కూలిపోయింది. నిపుణులైన సైనికులను ఆ బిలంగుండా పంపించి, లోపలనున్న పాలకులను హతమార్చమని ఆజ్ఞాపించాను. పాలకులు హతులయ్యారంటే కోట పతనం తప్పదు. అంతటితో మన దండయాత్ర విజయవంతంగా పరిసమాప్తమవుతుంది!" అన్నాడు.

"చాలా సంతోషకరమైన వార్త తెచ్చావు, మిత్రమా!" అంటూ అశోకుడు యశుణ్ణి



ఆ తరవాత అశోకుడూ, యశుడూ కోట లోపలికి అడుగుపెట్టారు. అశోకుణ్ణి చూడగానే నెత్తుటి మడుగులో చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న ఒక వృద్ధుడు, "మీరు మమ్మల్ని హతమార్చిన మాట నిజం. కాని, మా ఆత్మలనూ, ఆవేశాన్నీ హతమార్చలేరు. ఆ ఆవేశం, ఆగ్రహం తరతరాల వరకు చల్లారదు. మిమ్మల్నీ, నిరాయుధులైన మీ స్త్రీలనూ సర్వనాశనం చేసేంతవరకూ మా ఆవేదన చల్లారదు!" అన్నాడు బాధగా.

"నిరాయుధులైన మీ స్త్రీలను చంపిన వారెవరు?" అని అడిగాడు అశోకుడు తల వెనక్కు తిప్పి. కాని ఆ ప్రశ్నకు సమాధానం చెప్పేలోగానే ఆ వృద్ధుడు శాశ్వతంగా కన్నుమూశాడు.

"ఆఖరికి జగత్ప్రసిద్ధమైన తోశాలి కోట మన వశమయింది!" అన్నాడు యశుడు.

"కోట వశమయిందేమో నిజం. కాని కోట లోపల మనుషులెక్కడ?" అని అడిగాడు అశోకుడు ఆశ్చర్యంగా.

"రాజ ప్రతినిధులలో ఏ ఒక్కడు ప్రాణాలతో వున్నా మనం ఈ కోట లోపలికి అడుగు పెట్టడం సాధ్యం కాదు. కోటలోని ప్రజలలో పలువురు హతులయ్యారు. కొందరు గాయపడ్డారు. కొందరు బందీలుగా పట్టుబడ్డారు. అలాంటి వారిని సమీపంలోని దయానదీ తీరానికి తరలించాము," అన్నాడు యశుడు.

"అంటే మనం ఇప్పుడు పట్టుకున్నది నిర్మానుష్యమైన కోటనన్నమాట!" అన్నాడు అశోకుడు.

కౌగిలించుకుని, "తోశాలి కోట ఉపరితలంలో నిలబడి—మగధ సామ్రాజ్యంలో అంతర్భాగమైన ఈ కళింగ రాజ్యానికి నా మిత్రుడు యశుణ్ణి మగధ రాజ ప్రతినిధిగా నియమిస్తున్నానని ప్రకటించే క్షణం కోసం నేను ఎంత ఆతృతగా ఎదురు చూస్తున్నానో తెలుసా?" అన్నాడు పట్టరాని ఆనందంతో.

యశుడు సంతోషంగా నవ్వాడు.

యశుడి ఆజ్ఞ ప్రకారమే మగధ సేనాధిపతి తోశాలికోట లోపల వున్న సామంతులైన రాజప్రతినిధుల భవనాన్ని సైన్యంతో చుట్టుముట్టాడు. వారు మొత్తం ఇరవైఒక్క మంది ఉన్నారు. వారిలో పలువురు వృద్ధులు. అయినప్పటికీ శత్రువులతో వీరోచితంగా పోరాడి వీరమరణం పొందారు.

"నిర్మానుష్యమైనదేకాని, ఈ కోటలో కళింగ వ్యాపారులు తరతరాలుగా దూరతీరాలతో వర్తక వాణిజ్యాలు జరిపి కూడబెట్టిన ధనరాసులు, నిధులు చాలా ఉన్నాయి. ఇకపై కళింగ నౌకలు సముద్రం మీద సాగలేవు కదా!" అన్నాడు యశుడు.

"కళింగ వ్యాపారులు వర్తకవాణిజ్యాలను ఆపివేయడంవల్ల మనకు కలిగే ప్రయోజనం ఏమిటి? వాళ్ళు మన రాజ్యంలో భాగంగా వుంటూ ఎప్పటిలాగే దూరతీరాలలో వర్తకవ్యాపారాలు కొనసాగించవచ్చు కదా?" అని అడిగాడు అశోకుడు.

"అందుకు వాళ్ళు అంగీకరించవచ్చు. అయితే, తమకు బానిసలుగా కాదు; స్వతంత్రరాజ్య పౌరులుగా!" అన్న మాటలు వినిపించాయి.



ఆ మాటలు వినిపించిన వైపుకు తిరిగి చూశాడు అశోకుడు. క్షతగాత్రుడై కొనఊపిరితో కొట్టుమిట్టాడుతున్న మరొక సామంతు కనిపించాడు.

"నువ్వు ఇంకా ప్రాణంతో ఉన్నావా?" అంటూ అశోకుడి వెనక నడుస్తూన్న దళనాయకుడు—ఆ మాటలన్న సామంతును కత్తితో పొడిచాడు. దాంతో అతడు శాశ్వతంగా కన్నుమూశాడు!

"అనవసరంగా తొందరపడి అతన్నెందుకు చంపావు?" అన్నాడు అశోకుడు కాస్త కోపంగా.

"ప్రభూ! తమరు ఇక్కడ ఉన్నప్పుడు ఎటువంటి అజాగ్రత్తా పనికిరాదు. ఆ సామంతు అలా ధైర్యంగా మాట్లాడుతున్నాడంటే—తన వద్ద ఆయుధం దాచి వుంచడనే నమ్మకమేమిటి? దానిని అతడు తమపైకి విసిరే అపాయం వుంది కదా?" అంటూ దళనాయకుడి చర్యను సమర్థించాడు సేనాధిపతి.

"అయినా, మహారాజు సమక్షంలో, ఆయన అనుమతి లేకుండా ఏ పనీ చేయరాదని తమకు తెలియనిది కాదు కదా?" అన్నాడు యశుడు.

"క్షమించండి, ప్రభూ! ప్రభువుల క్షేమం పట్ల కాంక్షే నన్నాపనికి పురికొల్పింది!" అన్నాడు దళనాయకుడు.

అశోకుడు, యశుడితో, "ఇటువంటి దారుణ పరిస్థితులు మనల్ని దుర్మార్గులుగా మార్చివేయగలవేమో అని అనుమానం కలుగుతున్నది!" అన్నాడు బాధగా. ఆ తరవాత ఆయన సేనాధిపతికేసి తిరిగి,



"నిరాయుధపాణులైన స్త్రీలను మన సైనికులు ఊచకోత కోశారన్నమాట వాస్తవమేనా?" అని అడిగాడు.

సేనాధిపతి తలవంచి కిందిచూపులు చూడసాగాడు.

"మాట్లాడవేం? నిజం చెప్పు!" అని గద్దించాడు అశోకుడు మళ్ళీ.

"వాళ్ళు నిరాయుధపాణులైన మాట నిజమే. కాని మన శత్రు సేనలకు ఆహార పానీయాలందిస్తూ పరిచర్యలు చేశారు. మన సైనికులకన్నా వాళ్ళెంతో సుశిక్షితులు; శ్రమజీవులు. కళింగ సేనలలోని ఆత్మ స్థైర్యాన్ని దెబ్బతీయడానికి వాళ్ళను నాశనం చేయక తప్పలేదు!" అన్నాడు సేనాధిపతి.

"వాళ్ళెక్కడ ఉండేవారు?" అని అడిగాడు అశోకుడు.

"రాజ్యం నలుమూలల నుంచీ వచ్చారు. ఇక్కడికి సమీపంలోని గ్రామంలో బస చేశారు!" అన్నాడు సేనాధిపతి.

"నువ్వు నన్ను అక్కడికి తీసుకుపోవాలి!" అంటూ అశోకుడు వెనుదిరిగాడు.

యశుడూ, సేనాధిపతీ ఆయన్ను అనుసరించారు.

కోటకు వెలుపల నిలబడిన ఉపసేనాధిపతి రాజుకు నమస్కరించి, "ప్రభూ! లక్షకు పైగా కళింగ ప్రజలు హతులయ్యారు. అంతకన్నా ఎక్కువమంది బందీలుగా పట్టుబడ్డారు. యుద్ధం దాదాపు ముగిసినట్టే!" అన్నాడు.

అశోకుడు మౌనంగా తలపంకించి గుర్రం అధిరోహించాడు. యశుడు, సేనాధిపతి కూడా ఆయన్ను అనుసరించారు.

అంగరక్షకులు వెంటరాగా, అశోకుడు నగరం శివారులోని ఆ గ్రామాన్ని సమీపించాడు. గ్రామం చుట్టూ నక్కలూ, రాబందులూ శవాలను పీక్కుతింటున్నాయి. అక్కడి శోకమయమైన దృశ్యాలూ, అంతకు మించి నిశ్శబ్దమూ ఆయన హృదయ భారాన్ని పెంచాయి.

"యశా! ఇప్పుడు కళింగను జయించాము. ఇకపై నువ్వే ఈ రాజ్యానికి పాలకుడివి! నేను...." అశోకుడు మాటను పూర్తి చేసే లోగా పకపకమంటూ ఒక స్త్రీ నవ్వడం వినిపించింది. మరుక్షణమే యశుడు గుండెలు పట్టుకుని గుర్రంపై నుంచి నేలకు ఒరిగి పోయాడు. అతని గుండెలోకి బాణం చొచ్చుకుపోయింది!

అశోకుడూ, సేనాధిపతీ గుర్రంపై నుంచి కిందికి దిగారు. ఆ బాణం వేసిన వ్యక్తిని

పట్టుకోమని సేనాధిపతి సైనికులను ఆజ్ఞాపించాడు.

"నాకోసం వెతకనవసరంలేదు. నేను ఇక్కడే ఉన్నాను!" అంటూ ఒక అందమైన స్త్రీ చేతిలో బాణంతో అక్కడికి వచ్చింది. దళనాయకుడు ఆమెను పట్టుకున్నాడు.

నేలకు ఒరిగిన మిత్రుడి దగ్గరికి వెళ్ళాడు అశోకుడు. యశుడు మాట్లా డడానికి ప్రయత్నించాడుగాని, సాధ్య పడలేదు. ఒక్క క్షణం దిగ్భ్రాంతికి లోనైన అశోకుడు, ఆ తరవాత స్థిమితపడి లేచి నిలబడి, పట్టుబడిన యువతికేసి చూస్తూ, "ఎంత ఘోరం తలపెట్టావు?" అన్నాడు.

"కళింగను ఎవరూ జయించలేరని రుజువు చేశాను. అంతేకాదు; తమరు మాపై మరొక పాలకుణ్ణి నియమించలేరని కూడా ప్రత్యక్షంగా నిరూపించాను. అధికారం కోసమని ఈ భూమిపై ఎవరు కాలుమోపినా ఇదే గతి పడుతుంది!" అన్నదా యువతి దృఢమైన కంఠస్వరంతో.

"ప్రభూ, ఈ ధిక్కారం సహించరానిది. ఈ పాతకురాలిని చంపడానికి నన్ను అనుమతించండి!" అన్నాడు దళనాయకుడు.

"వద్దు, దళపతీ వద్దు! ఆమె కావాలనుకుని వుంటే మరింత హాని తలపెట్టి వుండవచ్చు. నాపై గురిపెట్టిన బాణం, మహారాజు మీదికి గురిపెట్టి వున్నట్టయితే— మన దండయాత్రనే నిష్ప్రయోజనంగా, అర్థరహితంగా మార్చివుండేది! మనకు తీరని పరాభవం ప్రాప్తించి ఉండేది. ఆమెను బ్రతకనివ్వండి..." అన్న యశుడు ఆపైన మాట్లాడలేకపోయాడు.

అంతలో ఒక సైనికుడు తెచ్చిన నీళ్ళను అశోకుడు యశుడికి త్రాగించడానికి ప్రయత్నించాడు. కాని యశుడు అంతలోనే ప్రాణం వదిలాడు.

అంతటా శ్మశాన ప్రశాంతత ఆవరించింది. మిత్రుడి ఆఖరి మాటలను గుర్తు చేసుకుంటూ అశోకుడు అతడి భౌతిక కాయం వద్ద చతికిలబడ్డాడు: ఆ యువతి కొద్దిగా భిన్నంగా బాణం గురిపెట్టి ఉన్నట్టయితే దండయాత్ర, విజయం నిష్ప్రయోజనం అయి ఉండేవి! అవును... ఈ దండయాత్రవల్లా, చేపట్టిన విజయంవల్లా, ఇప్పుడు మాత్రం సాధించిందేమిటి? అని తీవ్రంగా ఆలోచించసాగాడు. —(ముగింపు వచ్చే సంచికలో)





# బందిపోటు భైరవన్న

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అతికఠినమైన శ్రమలకోర్చగల నీ శక్తిసామర్థ్యాలను చూస్తూంటే ఆశ్చర్యం కలుగుతున్నది. బహుశా ఇందుక్కారణం, నువ్వు ప్రజాపాలనలో అనుసరించే తిరుగులేని న్యాయ, ధర్మ సూత్రాలు కావచ్చు. అయితే, ఒక్కొక్కసారి కొందరు రాజులు, ఏదో తాత్కాలికమైన మానసిక బలహీనత కారణంగా, తాము అంత వరకూ అమలు పరుస్తూన్న న్యాయ సూత్రా లకూ, శిక్షాస్మృతులకూ భిన్నమైన నిర్ణ యాలు చేస్తూంటారు. ఇందుకు ఉదాహరణగా, బందిపోటు భైరవన్న కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



పూర్వం మందారదేశాన్ని మణిధ్వజుడనే రాజు పాలించేవాడు. ఆయన ధైర్య సాహసాలూ, వివేకమూ గల రాజు. న్యాయ పరిపాలనకు ఆయన పెట్టింది పేరు. ఆయన కాలంలో శిక్షాస్మృతి అతి కఠినంగా ఉండేది. పట్టుబడిన దొంగల చేతులను నరికించేవాడు. బందిపోటులను ఉరి తీయించేవాడు. అయినప్పటికీ దేశంలో బందిపోటుల బెడద తప్పలేదు.

మందార దేశానికీ, పక్కనేవున్న సౌవీర దేశానికీ మధ్య పెద్ద అరణ్యం వున్నది. ఆ అరణ్యంలో వున్న బందిపోటుల కారణంగా ప్రజలు నానా యాతనలకూ గురి అవుతూండేవారు. మణిధ్వజుడి సైనికులు, ఆ బందిపోట్లను పట్టుకోవడానికి అనేక సార్లు ప్రయత్నించి విఫలులయ్యారు. దానికి కారణం, ఆ కీకారణ్యంలో బందిపోట్లకు అనేక రహస్య స్థావరాలుండడమే!

ఆ అరణ్యంలో వున్న భైరవన్న ఒక పెద్ద బందిపోటు. తండ్రి చనిపోయాక, అతిచిన్న వయసులోనే వాడు బందిపోటు దొంగలకు నాయకుడయ్యాడు. దారులు కాచిదోచడం వాడికి వెన్నతో పెట్టిన విద్య. ధనికులెవరైనా అరణ్యమార్గాన వెళుతున్నారని తెలిస్తే, వీలు చూసుకుని వాళ్ళపై తన ముఠాతో పడి డబ్బు కొల్లగొట్టేవాడు.

ఒకసారి భైరవన్న అనుచరులు, ఒక మునిని, మారువేషంలో వున్న రాజుగారి గూఢ చారి అన్న అనుమానంతో వాడి దగ్గరకు తీసుకువచ్చారు. ఆయన మునే అని నిర్ధారణ అయ్యాక భైరవన్న, మునిని అరణ్యం దాటించి వదిలివేయమని తన అనుచరుల నాదేశించాడు.

ముని అక్కడినుంచి కదలక భైరవన్నతో, "నాయనా! నేను కావాలనే ఈ దుర్గమమైన అరణ్యంలోకి వచ్చాను. నేనొకానొక యోగ సాధనలో వున్నాను. దానికి ఏకాగ్రత అవ సరం. నేను ధ్యానంలో వున్నప్పుడు నన్నెవరూ పలకరించరాదు. అయితే, నేనింతకు మునుపు ఎక్కడ యోగముద్రలో కూర్చున్నా, దారినపోయే వాళ్ళు తరచూ చూడవచ్చి, ప్రశ్న లతో వేధించుతూ నా ఏకాగ్రతను భంగపరిచే వారు. కొంతకాలం పాటు నీ రహస్య స్థావరంలో నేను తపస్సు చేసుకోవడానికి తగిన ఏర్పాట్లు చేయగలవా?" అన్నాడు. భైరవన్న ఇందుకు అంగీకరించి, మునికికావలసిన ఏర్పాట్లు చేసి, ఆయన అవసరాలను తనే స్వయంగా చూడ సాగాడు. ముని తపస్సు నిర్విఘ్నంగా సాగింది.

ఒకనాడు ముని, భైరవన్నను పిలిచి, "నాయనా, వేసవి వచ్చింది. నేను హిమాలయ పర్వతాలకు వెళ్ళాలి. నీ శుశ్రూషలూ, ప్రవర్తనా నాకెంతో ఆనందం కలిగించాయి. నాకు బాధ కలిగించేది, నీ వృత్తే! పరుల సొమ్ము దోచుకోవడం పాపమని, నీకు తెలియదా? పొట్టపోసుకోవడానికి ఎన్ని మార్గాలు లేవు? అతిహీనమైన, ఈ జీవిత మార్గాన్ని వదులుకో," అని హితబోధ చేశాడు.

దానికి భైరవన్న, "స్వామీ, పాపమేదో, పుణ్యమేదో నాలాటి వాడికేం తెలుస్తుంది! మా తాతతండ్రులనుంచి, మా వృత్తి ఇదే! నాకు కత్తి యుద్ధం తప్ప ఇంకో విద్య రాదు. నన్ను రాజుగారు సైనికుడుగా పెట్టుకుంటారా, పెట్టుకోరు. ఆయనకు దొరికిన దొంగలను కఠినంగా శిక్షించడం తప్ప, బాగుపరచా లన్న యోచన వుందా?" అని నిట్టూర్చాడు.

ముని, భైరవన్నను మార్చాలని శత విధాల ప్రయత్నించి, అవి విఫలమయ్యాక వాడితో, "నాయనా! నాకు తోచింది నీకు చెప్పాను. ఇక నీ ఇష్టం! నువ్వు నాకెంతో సేవ చేశావు. నీకొక ప్రత్యుపకారం చేయ దలచాను. నాకు తెలిసిన మంత్రమొకటి, నీకు ఉపదేశిస్తాను. దానిని జపించిన వెంటనే నువ్వు శిశువుగా మారిపోతావు. నీ జీవితాన్ని మళ్ళీ పుట్టుక నుంచి మొదలు పెడతావు. అయితే, తిరిగి భైరవన్నగా మాత్రం మార లేవు. ఇది గుర్తుంచుకుని, అవసరం వచ్చి నప్పుడు మంత్రాన్ని జపించు," అని ముని, భైరవన్నకు మంత్రాన్ని ఉపదేశించాడు.



ఇలా వుండగా-ఒకసారి సౌవీరదేశానికి ధనసహాయం కావలసి వచ్చినప్పుడు, మందారదేశపు రాజు మణిధ్వజుడు ధనాన్ని మెరికల్లాంటి సైనికులతో, తన దళపతిని తోడిచ్చి పంపాడు. అయితే, ఆ ధనం సౌవీర దేశం చేరలేదు. దళపతి, సైనికులు ఏమైందీ తెలియలేదు. ఇది అరణ్యంలోని బందిపోటుల పనే అని, మణిధ్వజుడు నమ్మాడు. ఆయన పెద్దఎత్తున సైన్యాన్ని సమీకరించి, దానికి తనే నాయకత్వం వహించి, అరణ్యంలోని బందిపోట్ల స్థావరాలను చుట్టుముట్టాడు. భైరవన్న దొరికి పోయాడు. వాడిని రాజు విచారణ జరిపినప్పుడు, దళపతితో పంపిన ధనం విషయం తనకు తెలియదన్నాడు; కాని తను బందిపోటును కాదని మాత్రం అనలేదు.



వేసినట్టే వున్నాయి. తప్పించుకోవడానికి ఇంకో మార్గం లేదు. కారాగారాధిపతి పసిబిడ్డను ఎత్తుకుని పరీక్షగా చూశాడు. ఆ పాప కుడిచెంప మీద మచ్చొకటి కొట్ట వచ్చినట్టు కనిపించింది. భైరవన్న కుడి చెంప మీద కత్తిగాటున్నట్లు అతడికి గుర్తొచ్చింది. ఆ బిడ్డలో భైరవన్న పోలిక లనేకం ఉన్నాయి.

భైరవన్న పసివాడుగా మారాడనటంలో ఎటువంటి సందేహానికీ తావు లేదు! అయితే, రాజుగారు ఉరితీయమన్నది. భైరవన్నను. వాడికి బదులుగా వున్న పసి పాపను ఏం చేయాలి? పసిపాపను తలారి కిచ్చి శిక్ష అమలు చేయాలా? కారాగార రక్షకుడికి ఏం చేయాలో తోచలేదు.

రాజు మణిధ్వజుడు కొలువుతీరి వున్న సమయంలో, కారాగారాధిపతి, పసివాడితో అక్కడికి వెళ్ళి, జరిగింది చెప్పాడు. మణి ధ్వజుడు సభ అభిప్రాయం అడిగాడు.

అప్పుడు, వర్తక ప్రముఖుల్లో ముఖ్యుడైన ప్రమోదగుప్తుడనే ఆయనలేచి, "మహారాజా! ఈ పసివాడి రూపంలో వున్నవాడు నిస్సందే హంగా బందిపోటు భైరవన్న! నిర్భేద్యమైన మందారదేశ కారాగారం నుంచి, ఈనాటి వరకూ ఎవరైనా తప్పించుకోగలిగారా? ఏ మాయమంత్రాల సాయంతోనో భైరవన్న శిక్ష తప్పించుకోవాలని చూస్తున్నాడు. ఆ తర్వాత వాడు భైరవన్నగా మారగలడు. తమరు బందిపోటుకు విధించదగిన శిక్ష విధించారు. కనుక, పసివాడిరూపంలో వున్న భైరవన్నను ఉరితీయవలసిందే. పసివాడని కనికరించి తమరు వదిలేస్తే,

మణిధ్వజుడు, భైరవన్న మాటలు నమ్మినా నమ్మకపోయినా, వాడు బంది పోటుగా అరణ్యంలో పట్టుబడడం వలన, వాడికి ఉరిశిక్ష విధించాడు. శిక్ష ఒక వారం రోజులలో అమలు జరగవలసి వున్నది. ఈలోగా వాణ్ణి కారాగారంలో వుంచారు. భైరవన్న తన దుస్థితికి కుమిలిపోసాగాడు. ఆ సమయంలో వాడికి, ముని ఉపదే శించిన మంత్రం జ్ఞాపకం వచ్చింది.

తెలతెలవారుతూండగా, కారాగార రక్షకుడు తన భటులతోనూ, తలారితోనూ వచ్చి, కారాగారం తలుపులు తెరిచాడు. భైర వన్నను నిద్రలేపడానికి దుప్పటి తొల గించగానే, దానికింద ఒక చంటిబిడ్డ కని పించాడు. ఆ పసివాడు కేరుకేరు మనగానే, వాళ్ళందరూ తుళ్ళిపడ్డారు. వేసిన తలుపులు

ముందు ముందు మంత్రతంత్రాల సాయంతో నేరస్థులు ఇలా మారి శిక్షలు తప్పించుకోవచ్చు. వీణ్ణి పసివాడని వదిలి వేయటమంటే, మన శిక్షాస్మృతిని మనమే అపహాస్యం చేసినట్టవుతుంది. కనుక పసివాడని కనికరించక ఈ రూపంలో వున్న బందిపోటు భైరవన్నను ఉరి తీయడం న్యాయపద్ధతి అవుతుంది!" అన్నాడు.

మణిధ్వజుడు కొద్దిసేపు ఆలోచించి, పసివాడు శిక్షార్హుడు కాదని చెప్పటమేగాక, వాడు తన అంతఃపురంలో పెరుగుతాడని సభకు తెలియబరిచాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా! నాకు మణిధ్వజుడి న్యాయనిర్ణయం గురించి అనేక సందేహాలున్నాయి. పసివాడి రూపంలో వున్నవాడు భైరవన్న అని అందరూ అంగీకరించారు కదా. రూపం మార్చుకున్నంత మాత్రాన బందిపోటు శిక్షార్హుడు కాకుండా పోతాడా? పైగా పసివాణ్ణి అంతఃపురంలోకి తీసుకుపోవడం అంటే, ఒక బందిపోటుకు రాచమర్యాదలు జరిపించినట్టే కదా? పసివాడన్న జాలి, రాజును శిక్షాస్మృతిని మరిచి పోయేట్టు చేసిందా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మణిధ్వజుడి న్యాయనిర్ణయం సరైనదే. శిశువురూపంలో వున్న భైరవన్న నిరపరాధి. రాజు తన దళపతి ద్వారా పంపిన ధనాన్ని తాను దోచలేదని భైరవన్న అన్నాడు. వాడి రహస్య స్థావరంలో ఆ ధనం దొరకలేదు కాబట్టి భైరవన్న అబద్ధం ఆడడం లేదని, రాజు గ్రహించి వుండాలి. అందువల్ల, ఆ విషయంలో వాడు శిక్షార్హుడు కాడు. భైరవన్న పసివాడుగా మారిన క్షణంలోనే, తన పాప జీవితానికి స్వస్తి చెప్పాడు. ముని, భైరవన్నకు మంత్రం ఉపదేశించడంలోని ప్రధానోద్దేశం, వాడిని సన్మార్గం వైపు మళ్ళించడమే! పసివాడుగా మారిన భైరవన్న కొత్త జన్మ ఎత్తినట్టే! ఈ అన్ని కారణాల వల్ల, రాజు నిర్ణయం న్యాయసమ్మతమనే దాంట్లో సందేహానికి తావులేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

*[ఆధారం: రామవరపు గణేశ్వరరావు రచన]*





# తండ్రి కానుక

చెన్నూరు గ్రామంలోని తిరుపతయ్యకు ఐదెకరాల మాగాణీ పొలమున్నది. ఆయనా, కొడుకు రంగయ్యా ఎంతో శ్రద్ధగా వ్యవసాయం చేస్తూండేవాళ్ళు. ఒక సంవత్సరం మినుముల పంట విపరీతంగా పండింది. ధాన్యం మొత్తం కల్లానికి చేర్చి, కాపలా మనిషిని పెట్టి, తగిన ధర కోసం తిరుపతయ్య ఎదురుచూడసాగాడు.

వారం తర్వాత లెక్క చూస్తే, రెండు మినుముల బస్తాలు తక్కువగా వున్నవి. తిరుపతయ్య కాపలావాణ్ణి అడిగితే, తను రాత్రంతా కన్ను మూయకుండా కాపలా కాస్తున్నానన్నాడు. తిరుపతయ్య వాడి మాట నమ్మక, కొడుకు రంగయ్యను రాత్రివేళ కాపలా పడుకోమన్నాడు.

ఆ రాత్రి కూడా ఒక బస్తా మాయమైంది. ఇది పని కాదని తిరుపతయ్య ఊళ్ళో అక్కడా ఇక్కడా అడిగి చూడగా, రంగయ్యే ప్రతి రోజూ ఒక బస్తా మినుములు అంగట్లో అమ్ముతున్నాడని తెలియవచ్చింది.

తిరుపతయ్య, ఈ మాటలు నమ్మలేదు. ఆయన ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, పొరుగూరు నుంచి తన చుట్టం నౌకరు వీరన్న, యజమాని పని మీద పంపగా తిరుపతయ్య ఇంటికి వచ్చాడు.

తిరుపతయ్య, వాడు చెప్పింది విని, "ఒరే, మీ యజమాని పని అంత అవసరమైందేమీ కాదు. ఒక్క నాలుగు రోజులు వుండు. మన కల్లంలోంచి మినప బస్తాలు దొంగిలించుకు పోయే దొంగను పట్టాలి," అన్నాడు.

ఆ రాత్రి తిరుపతయ్య, వీరన్నను కాపలా పడుకోమన్నాడు. అయినా, తెల్లవారి తిరుపతయ్య కల్లానికి వచ్చి చూస్తే ఒక బస్తా తక్కువగా వున్నది. అప్పుడే నిద్ర లేస్తున్న వీరయ్యను, ఆయన, "ఏమన్న నౌకరువురా! ఇక్కడ బస్తాల దగ్గిరున్న కాలి

దాసరి వెంకటరమణ

గుర్తులు చూస్తూంటే, దొంగ ఒకడే అని తెలుస్తున్నది. ఒక్కడు అంత బరువైన మినుముల బస్తా ఎత్తుకోలేడు. నువ్వే దొంగకు బస్తా ఎత్తి సాయపడుండాలి," అన్నాడు.

వీరన్న నేల చూపులు చూస్తూ, "అయ్యో, నాకేం తెలీదు. ప్రయాణ బడలికలో రాత్రి పడుకున్నవాణ్ణి, ఇదుగో ఇప్పుడే లేస్తున్నాను," అన్నాడు.

"రాత్రి కల్లంలోకి ఒకడే ఒకడు వచ్చిన కాలి గుర్తులు కనబడుతున్నవి. నువ్వు సాయపడితేతప్ప బస్తాను ఎవడూ ఒంటరిగా ఎత్తుకు పోలేడు. నిజం చెప్పు!" అంటూ తిరుపతయ్య, వీరన్నను నిలదీశాడు.

"అయ్యో! నాకేం తెలియదంటే నమ్మరే!" అంటూ వీరన్న తలతిప్పి, కొంచెం దూరంలో ఎడ్లకు కుడితి పెడుతున్న రంగయ్యకేసి చూస్తూ, "బస్తా ఎవరెత్తారో, మీ కొడుకునే అడగండి," అన్నాడు.

ఆయన కోపంగా రంగయ్యను, "ఏరా! రాత్రి నీకు బస్తా ఎవరెత్తారు? నిజం చెప్పు," అని అడిగాడు.

రంగయ్య, తండ్రికి దొరికిపోయానని సిగ్గుపడుతూ; "ఎవరూ ఎత్తలేదు, నేనే ఎత్తుకున్నాను," అన్నాడు.

ఆ జవాబుకు తిరుపతయ్య ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే, మినుముల బస్తా బరువుగా వుండి ఇద్దరు బలమైన మనుషులు శ్రమపడి ఎత్తితే తప్ప, దాన్ని కింద నుంచి లేపడం సాధ్యపడదు. ఆయనకు బస్తాలు పోయాయన్న బాధకన్నా, కొడుక్కు ఆ బస్తాలు ఎవరు ఎత్తారన్న విషయం కుతూహలంగా వుంది.



"నువ్వే ఎత్తుకుని వెళ్ళానని చెబుతున్నావుగదా! ఏదీ, నా ముందు ఒకసారి ఎత్తుకో," అన్నాడు తిరుపతయ్య.

రంగయ్య ఒక మినుముల బస్తాను నిలబెట్టి, దానికి తన వీపును ఆనించి, తన రెండు చేతుల్నీ భుజాల మీదుగా వెనక్కు పోనిచ్చి బస్తాను గట్టిగా పట్టుకుని, ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు. తర్వాత వాడు, వీపు మీది బస్తాతో కల్లంలో ఒక చుట్టు తిరిగి, తండ్రి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

తిరుపతయ్య ఆశ్చర్యంగా కొడుకు వంక చూస్తూ, "రంగా, పో! పోయి అంగట్లో అమ్ముకో," అన్నాడు.

రంగయ్య తలవంచుకుని తటపటాయిస్తూ పక్క చూపులు చూడసాగాడు. ఈసారి తిరుపతయ్య ఆప్యాయంగా కొడుకు

భుజం తడుతూ, "ఒరే, నేను నిజంగానే చెబుతున్నాను. నువ్వు ప్రదర్శించిన అసాధారణమైన బలప్రదర్శనకు, నేనిస్తున్న ఈ కానుక చాలా చిన్నది!" అన్నాడు.

రంగయ్య సంతోషంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. తిరుపతయ్య వీరన్నకేసి చూసి, "ఏరా, వీరన్నా! ఇప్పుడు జరిగిందేమిటో చూశావు గదా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు వీరన్న చిన్నగా నవ్వి, "అయ్యా, ఇప్పుడు జరిగిందే కాదు, రాత్రి జరిగింది కూడా కళ్ళారా చూశాను!" అన్నాడు.

"అలాగా! మరి జరిగిన దొంగతనం చూసి కూడా, ఏమీ తెలియదని అబద్ధమాడావెందుకు?" అని అడిగాడు తిరుపతయ్య.

"అయ్యా! మీ కొడుకు చేసిన పని, నా దృష్టిలో దొంగతనంగా కనిపించలేదు. నేను విన్నంతలో మీ కొడుకు ఒళ్ళు దాచుకోకుండా కష్టపడి పనిచేసే మనిషి. కాదంటారా?" అన్నాడు వీరన్న.

ఆ వెంటనే తిరుపతయ్య, "వాడు కష్టపడి పనిచేసే మనిషి కాదని ఎవరంటారు! ఇంకా చీకటి వుండగానే లేచి పశువులశాల ఊడ్వడం దగ్గరనుంచి, ఎడ్లకు పచ్చిగడ్డి కోసుకు రావడం, నాలుగు మెతుకులు తిని పొలం వెళ్ళడం, అక్కడ పనులు చూసుకుని చీకటి పడ్డాక ఇంటికి తిరిగి రావడం—ఇలా నడ్డి విరిగేలా పని చేస్తూంటాడు. అలాంటివాడు, సొంతపొలం కల్లంలో ఎందుకు దొంగతనం చేయవలసి వచ్చింది. అదీ నా బాధ!" అన్నాడు.

దానికి వీరన్న, "అయ్యా! ఇందులో మీరు బాధపడవలసిందేం లేదు. అంత మంచివాడు దొంగతనం ఎందుకు చేయవలసి వచ్చిందో, మీరే శాంతంగా ఆలోచించండి. పిల్లలు ఒక వయసుకు ఎదిగి వచ్చాక, సొంత ఖర్చుల కంటూ ఏదో కొంత డబ్బు అవసరమవుతుంది. అది పెద్దలు గ్రహించకపోతే, వాళ్ళు ఇలా ఇంటి దొంగతనాలకు పాల్పడతారు. ఇది కొంతలో కొంత నయం. అలాకాక, పరాయివాళ్ళ సొత్తు దొంగిలించే ప్రయత్నం చేస్తే, నలుగురిలో అవమానం పాలవవలసి వచ్చేది," అన్నాడు తాపీగా.

దీనితో తిరుపతయ్యకు తన పొరపాటేదో తెలియవచ్చింది. ఆ తర్వాత, రంగయ్యకు దొంగతనం చేయవలసిన అవసరం కలగలేదు.



కావేరీతీర ప్రయాణం-1

# కావేరీ జన్మస్థానం

రచన : జయంతి మహాలింగం ★ చిత్రాలు : గోపకుమార్




భారతదేశంలోని ప్రధానమైన ఏడు నదులలో ఒకటిగా కావేరి పేరు గాంచింది. దక్షిణ గంగ, పొన్ని నది, అఖండ కావేరి, అన్నపూర్ణ అనే పేర్లతో కావేరినది చరిత్ర ప్రసిద్ధి గాంచింది. కర్నాటక-తమిళనాడు రాష్ట్రాల గుండా ఇది దాదాపు 765 కి.మీ. దూరం ప్రవహిస్తూ ఉభయ రాష్ట్రాల ప్రజల జీవితాలతో కలగలిసిపోయింది.

**పురాణాలలో కావేరి ప్రశస్తి**

కావేరి పుట్టుకకు సంబంధించిన కథలు మన పురాణాలలో చాలా ఉన్నాయి.

స్కాందపురాణం ప్రకారం పావన కావేరీ నది ఒకప్పుడు కైలాసంలో ప్రవహించేది. దానిని తపోనిధి అయిన అగస్త్యముని కమండలంలోకి ప్రవేశించమని పరమశివుడు ఆదేశించాడు. ఆ తరవాత కొంత కాలానికి అగస్త్యుడు వింధ్యపర్వతాలను దాటి దక్షిణ భారతదేశానికి వచ్చాడు. ఆ సమయంలో బలవంతుడైన ఒక రాక్షసుడి భయం కారణంగా మేఘాలు వర్షించకపోవడం వల్ల, దక్షిణ భారతదేశం తీవ్ర క్షామానికి గురయింది. అగస్త్యుడు ధ్యాననిమగ్నుడై ఉన్నప్పుడు, ఇంద్రుడి ప్రార్థన మేరకు, విఘ్నేశ్వరుడు కాకి రూపం దాల్చి, అగస్త్యుడి కమండలాన్ని దొర్లించాడు. కమండలం లోని జలం కింద ఒలికి కావేరీ జీవనదిగా ప్రవహించడం ప్రారంభమయింది.

అగస్త్యముని కమండలాన్ని దొర్లించిన విఘ్నేశ్వరుడు

## కొడగుమల కావేరి



తలకావేరిలోని చిన్న దేవాలయం

కావేరీనది కర్నాటక రాష్ట్రం కొడగు (కూర్గ్) జిల్లాలోని బ్రహ్మగిరి కొండ పాదతలంలోని తలకావేరి వద్ద ఆవిర్భవిస్తున్నది.

అక్టోబర్ నెల 16, 17 తేదీలలో తులా సంక్రమణ పుణ్య కాలంలో ఇక్కడ నీటి బుగ్గ పైకి ఉబుకుతుంది. ఆ రోజే నెలరోజులు సాగే తులాసంగం ఉత్సవం ఆరంభమవుతుంది. బుగ్గ నుంచి పెల్లుబికే నీరు చతురస్రాకారంలో వున్న కొలనును (పుష్కరణిని) నింపుతుంది.

అలా నీటి బుగ్గ పైకి ఉబకడాన్ని చూడడడానికి భక్తులు అసంఖ్యాకంగా వస్తారు. నీళ్ళు పైకి ఉబికేప్పుడు దేవుణ్ణి స్మరిస్తూ ఈ పుష్కరిణిలో పోటీ పడి పవిత్ర స్నానం చేస్తారు. స్నానానంతరం కొలను సమీపంలో వున్న చిన్న గుడిలో కావేరీ పూజ చేస్తారు.

తలకావేరి పుష్కరిణికి ఎగువ 90 మీ॥ ఎత్తులో బ్రహ్మగిరి శిఖరం ఉన్నది. ఈ మార్గమధ్యంలోని అగస్తీశ్వర ఆలయంలో కూడా భక్తులు పూజలు జరుపుతారు.

తులాసంగం అనే కావేరీ ఉత్సవం కొడవ (కూర్గ్) జాతి ప్రజలకు చాలా ప్రధానమైనది. ఈ జిల్లాలో కూర్గ్ జాతి ప్రజలు అధిక సంఖ్యలో నివసిస్తున్నారు. కొడవాలు తమ జీవిత కాలంలో కనీసం ఒక్కసారైనా తులామాసంలో ఈ పవిత్ర స్నానం చేయడం విధిగా పాటిస్తారు. వీరిలో చాలామంది కావేరి, కావేరియప్ప అని పేర్లు పెట్టుకుంటారు. భర్త ఇంటికి కొత్తకాపురానికి వెలుతున్న కన్న కూతురికి తల్లిదండ్రులు నగలూ, నాణ్యాలూ పెట్టే విధంగా—తలకావేరిలో పుట్టి చాలాదూరం ప్రయాణం సాగించి భర్త అయిన సముద్రుణ్ణి కలిసే కావేరీ నదిని తమ కుమార్తెగా భావించి—సంపన్నులైన కొడవాలు ఒకప్పుడు బంగారు నాణాలనూ, ఆభరణాలనూ కావేరి కొలనులోకి విసిరేవారు!

కొడవాలు దృఢకాయులు; అందమైనవాళ్ళు; ధైర్యవంతులు. ప్రాచీన సంప్రదాయాల పట్ల గౌరవాదరాలు కలిగినవాళ్ళు. కొడవా స్త్రీల (కొడవతుల) చీరకట్టు విలక్షణంగా ఉంటుంది. దానికి సంబంధించిన విచిత్రమైన కథ కూడా ఒకటి ప్రచారంలో ఉన్నది: ఒకానొకప్పుడు పార్వతీదేవి కొడుగు యువరాణి దేవకాంత కలలో కనిపించి—కొడవ ప్రజలందరినీ వాలంబురి అనే చోట గుమిగూడమనీ, తాను అక్కడ వారికి దర్శనమిస్తాననీ చెప్పింది. పార్వతీదేవి రాకకోసం అందరూ అక్కడ కాచుకుని ఉన్నప్పుడు—పార్వతీదేవి నదీ రూపంలో ఉధృత ప్రవాహంగా కొండపై నుంచి ఉరుకుతూ వచ్చింది. జలప్రవాహ వేగానికి అక్కడ చేరిన స్త్రీల చీరలు అప్రదక్షిణంగా సుడులు తిరిగాయి.



అందువల్ల కొడవతులు ఇప్పటికీ తమ చీరలను నడుం చుట్టూ అప్రదక్షిణంగానే అంటే—కుడి నుంచి ఎడమ వైపుకు కట్టుకుంటారు.

కొడవాల భక్తి ప్రపత్తులకు సంతసించిన కావేరీమాత వారికి కావలసినంత ప్రకృతి సంపదలను ప్రసాదించింది. పుష్కలంగా పండే కాఫీ, వరిపంటలతో పాటు—వెదుళ్ళు, టేకు, శ్రీగంధం అడవులు ఈ ప్రాంతంలో విరివిగా ఉన్నాయి.

బ్రిటిష్ పాలనాకాలంలో కొడగు జిల్లాకు మడికేరి (మెర్కారా) రాజధానీ పట్టణంగా ఉండేది. వీరరాజపేట దీని ప్రాచీన రాజధాని. సంవత్సరం పొడవునా వాతావరణం చలిగా ఉంటుంది. వేసవికాలంలో మాత్రమే ఉష్ణోగ్రత 30 డిగ్రీల సెల్సియస్ దాటుతుంది. జిల్లాలో మూడు ప్రాంతాలలో యేటా 5,000 మి.మీ. కన్నా ఎక్కువ వర్షపాతం ఉంటుంది.



మడికేరిలో ప్రధాన ఆకర్షణలు అక్కడున్న కోట; అందులోని భవనం. ఈ రెండింటినీ హలేరీ వంశానికి చెందిన ముద్దురాజా 1681వ సం॥లో నిర్మించాడు. ఇప్పుడా భవనం ప్రదర్శన శాలగా మార్చబడింది. కొడగు జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి సేకరించిన 'వీరక్కల్స్' వంటి పురాతన వస్తువులు ఇక్కడ చాలా ఉన్నాయి.

బ్రహ్మగిరి పాదతలంలోని భగమండలంలో మొట్టమొదటి ఉపనది కనకానది కావేరిలో కలుస్తున్నది. గంగానది అంతర్వాహినిగా, అదృశ్యంగా వచ్చి కావేరిలో సంగమిస్తుందని భక్తులు విశ్వసిస్తారు. ఉత్తర భారతదేశంలోని ప్రయాగ త్రివేణీ సంగమంలాగే ఇది కూడా పవిత్రమైనదని భావిస్తారు. భక్తుల పాపాలను హరించే గంగానది, అంతర్వాహినిగా అదృశ్యంగా వచ్చి భగమండలంలో కావేరిలో స్నానం చేసి మళ్ళీ పావనమౌతుందని కొందరి భక్తుల విశ్వాసం!

ఈ నదీ సంగమం వద్ద వున్న భగండేశ్వర ఆలయం సుప్రసిద్ధ శివాలయం. 1790వ సం॥లో స్థానికపాలకుడైన దొడ్డ వీర రాజేంద్రకూ—టిప్పు సుల్తానుకూ జరిగిన యుద్ధసమయంలో ఈ ఆలయంలోని కొంత భాగం శిథిలమైపోయింది. ఆలయం పైకప్పులో మూడు రాగి పెంకులు నాశనమయ్యాయి. వీర రాజేంద్ర వాటికి బదులు వెండి పెంకులు అమర్చాడు. వాటిని ఇప్పటికీ చూడవచ్చు.

భగమండలంలో 'మధువనం' అనే తేనె

ప్రవాహానికి నుడులు తిరిగిన కొడవతుల చీర

వ్యాపార కేంద్రం ఉన్నది. ఇక్కడ తేనెటీగలను పెంచుతారు. ఇక్కడ మనదేశంలో చాలా అరుదైన తేనెతుట్టెల ప్రదర్శనశాల ఒకటి ఉన్నది. వాసన ద్రవ్యాలకు ముఖ్యంగా ఏలకులకు ఈ ప్రాంతం ప్రసిద్ధిగాంచింది.

కొడగు—మైసూరు సరిహద్దులో కుశాల్ నగర్ ఉన్నది. మైసూరు పాలకుడు హైదర్—అలీ ఇక్కడ విడిదిచేసి ఉన్నప్పుడే ఆయన కొడుకు టిప్పు జన్మించాడన్న వార్త అందింది. ఈ శుభవార్త అక్కడే అందడం వల్ల ఆయన ఆ పట్టణానికి 'కుశాల్ నగర్' అని పేరుపెట్టాడు. కుశాల్ నగర్ దాటగానే కావేరీనది కొడగు-మైసూరు జిల్లాల మధ్య సహజ సిద్ధమైన సరిహద్దు రేఖగా ఉంటున్నది.

మడికేరి—మైసూరు రహదారిపై వున్న పెరియ పట్టణ ప్రాంతంలో ఒకప్పుడు పులులు ఎక్కువగా ఉండేవి. పెద్ద పులులు ఒకప్పుడు ఇక్కడి కోటలలోకీ, దేవాలయాలలోకి చేరాయనీ, కొడుగు వేటగాళ్ళు ఎంతో నైపుణ్యంతో వాటిని వేటాడి చంపి ఈ ప్రాంతాన్ని నివాసయోగ్యంగా మార్చారనీ చెప్పుకుంటారు. పెరియ పట్టణలోని 'నార్త్ కొడగు క్లబ్'కు సర్ విన్‌స్టన్ చర్చిల్ పోషకుడుగా ఉండేవాడు. ఆయన భారత సైన్యంలో అధికారిగా ఉన్నప్పుడు ఇక్కడ కొన్నాళ్ళు గడిపాడని చెబుతారు.



కాఫీ గింజల సేకరణ

## కొడగు—మరికొన్ని విశేషాలు:

- కొడవాల మొత్తం జనాభాతో పోల్చినట్లయితే మన సైన్యంలో వాళ్ళ సంఖ్య ఎక్కువ అనే చెప్పాలి. ఫీల్డ్ మార్షల్ కరియప్ప, జనరల్ తిమ్మయ్య కొడగుజాతికి చెందినవాళ్ళే.
- కొడుగు నుంచి యేటా నాలుగు లక్షల టన్నుల తేనె తయారవుతున్నది.
- బ్రిటిష్ పాలనకు పూర్వం ఇక్కడ మామూలు బళ్ళు వెళ్ళడానికి తగిన రోడ్లు కూడా లేవు. కాలినడకన లేదా గుర్రాలపై ప్రయాణం చేసేవాళ్ళు. దురాక్రమణకు భయపడి కొడగు రాజులు బాటలు వేయలేదు. మడికేరి నుంచి కుశాల్ నగర్ వరకు బ్రిటిష్ వాళ్ళు నిర్మించిన రోడ్డు 1835వ సం॥లో తెరువబడింది.
- కావేరీ ఉపనది లక్ష్మణతీర్థ తీరంలో ఉన్న 'నాగర హొూల్ నేషనల్ పార్క్' 571 చ.కి.మీ. విస్తరించి ఉన్నది.



ఫీల్డ్ మార్షల్ కరియప్ప



# పొదుపు-ప్రయత్నం

ఒక చిన్న పల్లెగ్రామంలో పుట్టి పెరిగిన అనంతుడు, పద్దెనిమిదేళ్ళ వయసులో విద్యాభ్యాసం పూర్తిచేశాక, తండ్రి మరణించాడు. అతడు గ్రామంలోనే ఉన్న కొద్దిపాటి వ్యవసాయప్పనులు చూసుకుంటూ, జమీందారు జగపతిరాయణం దివాణంలో ఉద్యోగం కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఒక సంవత్సరం గడిచాక, అనంతుడికి దివాణంలో ఉద్యోగం దొరికింది. జగపతి రాయణం, తన దగ్గర పనిచేసే వారందరి క్షేమం స్వయంగా తెలుసుకుని, కన్నబిడ్డల్లా చూసుకునేవాడు. ఉద్యోగంలో చేరిన వారం రోజుల తర్వాత అనంతుడు తన గ్రామానికి తిరిగివెళ్ళి, తల్లిని తనవెంట పట్టణానికి తీసుకువెళ్ళాలని ప్రయత్నించాడు.

అయితే, అనంతుడి తల్లి అందుకు ఒప్పుకోక, "నేనూ, మీ నాన్నా ఈ ఇంట్లోనే కష్టసుఖాలు అనుభవించాం. నా ప్రాణం పోయేంతవరకూ నేనీ ఇంట్లోనే వుంటాను తప్ప, వేరే ఎక్కడికీ కదలను. నువ్వు నన్ను చూడాలనుకున్నప్పుడల్లా, వచ్చిపోతూ వుండు," అన్నది.

ఎన్నివిధాల నచ్చచెప్పాలని చూసినా తల్లి వినకపోవడంతో అనంతుడు, "మరి పట్నంలో నా తిండి తిప్పలు ఎవరు చూస్తారు? నాకేమో, వంటచెయ్యడం తెలియదాయె!" అన్నాడు.

తల్లి చిరునవ్వుతో కొడుకువంక ఆప్యాయంగా చూసి, "పిల్ల సిద్ధంగా వుంది. పెళ్ళి చేసుకుని తీసుకుపో," అన్నది.

అనంతుడికి మామయ్య వరసయిన భద్రయ్యకు, వాణి అనే కూతురుంది. చిన్నప్పటి నుంచి అనుకున్న సంబంధం. వాణి, అనంతుడు ఒకరినొకరు ఇదివరకే ఇష్టపడివున్నారు.

బొమ్మిడి అచ్చారావు



అనంతుడు తన అంగీకారం తెలియ జెయ్యడంతో, వారం తిరక్కుండానే వాణి అతడి పెళ్ళామయింది. మరొక వారం రోజుల్లో అతడితో పట్నంలో కాపురం కూడా పెట్టింది. అతడు బాడుగకు తీసు కున్న ఇల్లు, కేవలం ఒక్క పడక గది, చిన్న వంటగది మాత్రమే. అయితే అప్పటి వరకూ వాళ్ళకు బాగానే సరిపోయిన ఆ ఇల్లు, సంవత్సరంన్నర గడిచేసరికి మూడో వ్యక్తి వాళ్ళతో చేరగానే చాలా ఇరుకై పోయింది.

అనంతుడికి కొడుకు పుట్టాడు. వాణి భర్తను ఏదైనా పెద్ద ఇల్లు చూడమని పోరటం మొదలుపెట్టింది.

"మనకొచ్చే ఆదాయంతో ఇంతకన్న పెద్ద ఇల్లు భరించలేం. పట్నంలో కిరాయి చాలా హెచ్చు. చూస్తున్నావుగా!" అన్నాడు అనంతుడు.

వాణి కాసేపు ఆలోచించి, "పోనీ, మనమే స్వంతంగా ఒక ఇల్లు కట్టుకుందాం," అన్నది.

అనంతుడు నిర్ఘాంతపోయి, "ఏమిటీ, అద్దె భరించలేని మనం స్వంతంగా ఇల్లు కట్టుకోవడమే! పిచ్చికలలు కనడం మానెయ్యి," అన్నాడు.

అయినా వాణి అంతటితో తన ప్రయత్నం విరమించలేదు. తమకొచ్చే ఆదాయంలోనే వీలైనంతవరకు పొదుపు చేసి కాస్తకాస్త సొమ్ము వెనకేసింది. కొన్నాళ్ళు గడిచాక భర్తతో ఆ మాట చెప్పింది.

అనంతుడు నవ్వి, "నువ్వు దాచిన సొమ్ముకు వందగజాల స్థలం కూడా దొరకదీ పట్నంలో. ఇక ఇల్లు కట్టడానికి సొమ్మేదీ?" అన్నాడు.

వాణి తన పట్టుదల వదల్లేదు. ఈలోపల మరొక బిడ్డకు జన్మనిచ్చిందామె. ఈసారి ఆడపిల్ల. మళ్ళీ భర్తను స్వంత ఇంటికోసం పోరింది. అనంతుడు ఆమె ఆలోచన కొనసాగనివ్వలేదు.

ఇలా వుండగా-జమీందారు తన వద్ద పని చేస్తున్న వారందరికీ, ఊరి చివర ఇళ్ళ స్థలాలను ఉచితంగా పంచి పెట్టాడు. అనం తుడికి కూడా అందులో ఒక వంద గజాల స్థలం దొరికింది.

వాణి మళ్ళీ తన అభిప్రాయాన్ని అనం తుడితో మరింత పట్టుదలగా, "ఇప్పటికైనా మనం స్వంతఇల్లు కట్టుకోవటం చాలా అవసరం. పిల్లలు పెరిగేకొద్దీ, వాళ్ళ అవస

రాలు తీర్చటంలో పడి ఎప్పటికీ ఇల్లు కట్టలేం. నామాట విని ఇల్లుకట్టే ప్రయత్నం చెయ్యండి," అన్నది.

అనంతుడు ఆమె ఉత్సాహాన్ని మళ్ళీ నీరుకార్చేశాడు. "ఇల్లు కట్టటం సామాన్య మైన పని కాదు. కలప కొనాలి. ఇటుకలు, సున్నం కావాలి. ఒక పక్క పనివాళ్ళు కూలీ విపరీతంగా పెంచేశారు. మనలాంటి సామాన్యులు పూరిపాక కూడా కట్టలేరు," అన్నాడు.

వాణికీసారి చాలా కోపమొచ్చింది. "అసలు ప్రయత్నమంటూ చేస్తేకదా! ముందుగా మనకున్నదాంతో కనీసం గోడలైనా లేపితే, ఆ తర్వాత కలప గురించి, పైకప్పు గురించి ఆలోచించవచ్చు," అన్నది.

అనంతుడు సమాధానం చెప్పకుండా దివాణానికి వెళ్ళిపోయాడు.

వాణి తను పొదుపు చేసిన సొమ్ము లెక్కించింది. పనివాళ్ళను రప్పించి మాట్లాడింది. తమకు జమీందారు ఇచ్చిన స్థలంలో పునాదులు తవ్వించింది. అనంతుడు వారించబోయి, ఇక తన మాట వినదని నిర్ణయించుకుని మౌనంగా వూరుకున్నాడు.

చూస్తూండగానే పునాదులపై గోడలు కూడా లేచాయి. ఈలోపల పల్లెటూరిలో వున్న అన్నగారికి కబురు చేసింది వాణి. ఆయన తమ పొలంలోని చెట్లను కొట్టించి, ఎడ్లబండ్లపై కలపవేసుకుని వచ్చి, చెల్లెలి ప్రయత్నానికి ఊపిరిపోశాడు.

క్రమంగా ఇంటికి తలుపులు, కిటికీలు పెట్టడం కూడా పూర్తి అయింది. అప్పటికి వాణి తను పొదుపు చేసిన సొమ్మంతా ఖర్చు



చేసేసింది. ఇరుగుపొరుగువారి వద్ద కొంత మొత్తం అప్పు కూడా చేసింది. పైకప్పు వద్ద పని ఆగిపోయింది.

ఈ స్థితిలో, ఒకనాడు అనంతుడు భోజనంచేసి విశ్రమించిన సమయంలో, ఆమె, "మీ స్నేహితులెవరైనా, మనకు అప్పు ఇస్తారేమో చూడండి. పైకప్పుకు తాటి వాసం, పెంకు వుంటే ఇల్లు పూర్తయి పోతుంది. ఇంతవరకు వచ్చాక తాటాకు నేస్తే ఏం బావుంటుంది!" అన్నది.

అనంతుడు ఇబ్బందిగా ఆమెవంకచూసి, "నేను చేయిచాచి ఎవర్నయినా ఎప్పుడైనా అడిగానా? ఇల్లు లేకపోయినా ఫరవాలేదు, పరువుపోకూడదు," అన్నాడు.

ఇది జరిగిన రెండురోజులకు గ్రామం నుంచి, వాణి చిన్ననాటి స్నేహితురాలు

ఆమెను చూడవచ్చి, విషయం తెలుసుకుని, "ఏనాడో నాకు కబురు చేయవలసింది! మా పొలంలో మంచి చేవగల తాటిచెట్లు వున్నాయి. పైకప్పుకు కావలసిన వాసం నేను పంపిస్తాను, ధైర్యంగా వుండు," అన్నది.

ఈవిధంగా, స్నేహితురాలు పంపిన తాటివాసంతో పైకప్పుకు, ఒక రూపం వచ్చింది. ఇక పెంకు నేస్తే సరిపోతుంది. వాణి పట్నంలో వున్న ఒక పెంకుల కర్మాగారం గురించి వాకబు చేసింది. దాని యజమాని వాయిదాల పద్ధతిలో డబ్బు చెల్లించేందుకు అంగీకరించాడు. అయితే, అందుకు మధ్యవర్తి ఎవరైనా హామీ ఇవ్వాలని షరతు పెట్టాడు.

తనకు హామీ వుండేందుకు, ఎవరు దొరుకుతారా అన్న తీవ్రమైన ఆలోచనలో పడింది వాణి. ఈ జరుగుతున్నదంతా అనంతుడు గమనిస్తూనే వున్నాడు. ఉదయం వాణి కిటికీ దగ్గర కూర్చుని తల దువ్వుకుంటూండగా, తనింటికేసి వస్తున్న పెంకులతో వున్న బళ్ళూ, పక్కనే నడుస్తున్న అనంతుడూ కనిపించి-ఆమె నిర్ఘాంతపోయి, ఇంటిబయటికి వచ్చింది.

అనంతుడు భార్యకేసి చిరునవ్వుతో చూస్తూ, "అంతగా ఆశ్చర్యపడకు వాణీ! ఈ పెంకంతా మన ఇంటి కప్పు కోసమే. ప్రయత్నం చేయాలే గానీ, మనిషికి అసాధ్యమైనది లేదని నువ్వు నిరూపించావు. ఇప్పటికైనా, నా ప్రయత్నం నేను చేయక పోతే, నీకు చాలా అన్యాయం చేసిన వాడినవుతాను," అన్నాడు.

భర్తలో ఇన్నాళ్ళకు తాను కోరుకుంటున్న మార్పు వచ్చినందుకు వాణి పరమానందం చెందింది.

"స్వంత ఇల్లు కట్టుకునే ప్రయత్నంలో, మీరు మొదటినుంచీ ఈమాత్రం సహకరించి వుంటే, మనం ఏనాడో అద్దె ఇళ్ళల్లో వుండే బాధ తప్పేది," అన్నది.

"ఏమైనా, ఆ అద్దె ఇళ్ళ బాధ తప్పించిన దానివి, నువ్వు! దుబారా ఖర్చులు చేయకుండా, పొదుపుగా కాపరాన్ని చక్కదిద్దగలిగితే, ఎన్ని ఘనకార్యాలు చేయవచ్చునో, నాకిప్పుడర్థమైంది," అన్నాడు అనంతుడు.

"అవును, మన స్థాయికి, ఇప్పుడు మనం చేసింది, చాలా గొప్ప ఘనకార్యం!" అంటూ వాణి పెద్దగా నవ్వింది.



అంగ్లేయులను ఎదిరించిన యోధులు

⑥

# వేలూరులో తిరుగుబాటు

రచన: మీరా ఉగ్రా ★ చిత్రాలు: టి.జి.ఎస్



















ఆ తరవాత—
అయ్యా! దయచేసి తలపాగాలు పెట్టుకోనివ్వండి.


మా నుదుట బొట్టు, చెవి పోగులు....
గడ్డాలూ, మీసాలూ ఇవన్నీ మా మత చిహ్నాలు. వాటిని మేము ధరించాలి.


హాస్యాస్పదం


సిపాయిలు కొత్త నిబంధనలు పాటించకపోయే సరికి వాళ్ళల్లో పందొమ్మిది మందిని విచారణ కోసం మద్రాసుకు పంపారు. అక్కడ—
క్రమశిక్షణా రాహిత్యం సహించ రానిది. వాళ్ళకు తగిన గుణపాఠం నేర్పాలి!


సిపాయిలను వందల కొద్దీ కొరడా దెబ్బలు కొట్టించారు.


ఈ వార్త వేలూరుకు చేరగానే—
మమ్మల్ని మా మత చిహ్నాలను తొలగించ మంటారా?
మీరు తొలగించక పోతే ఆ పని మేమే చేస్తాం.
















1799వ సం॥లో టిప్పుసుల్తాన్ శ్రీరంగపట్నంలో ఓడిపోయి మరణించాడు. మొయిజుద్దీన్ ఆయన కుమారుడు.
















నాలుగు వందల మంది తిరుగుబాటుదారులు తమ ప్రాణాలు కోల్పోయారు. మరెందరో గాయపడ్డారు. తొలి దశలో కొంత విజయం చవిచూసిన టిప్పు సుల్తాన్ కుమారుణ్ణి, ఆయన కుటుంబ సభ్యులనూ ఈస్ట్ ఇండియా కంపెనీ పట్టుకుని మొదట మద్రాసుకూ, అక్కడి నుంచి కలకత్తాకూ తరలించింది.




నహుషుడు మొదట మహా సజ్జనుడు, కాని ఇంద్రపదవి రాగానే భోగలాలసుడై పోయి, దేవస్త్రీలతో విహరిస్తూ ఒకనాడు ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని చూసి ఆమెను మోహించాడు. తాను ఇంద్రుడే గనక శచీదేవి ఇప్పుడు తనకు భార్యగా ఉండా లని నహుషుడు కబురు చేసేసరికి, శచీదేవి భయపడి బృహస్పతి శరణుజొచ్చింది.

ఈ సంగతి విని నహుషుడు బృహస్పతి పైన మండిపడి, ఋషులనూ దేవతలనూ తిట్టాడు.

"పరపురుషుడి భార్యను కోరటం మహా పాతకం," అని వాళ్ళు నహుషుడికి నీతి చెప్పారు.

"ఇంద్రుడు ఇలాటి పనులు చాలా చేశాడు. మీరంతా అతనికి నీతి చెప్పలేక పోయారా?" అని నహుషుడు వారిని కోపంగా అడిగాడు. అప్పుడు దేవతలు బృహస్పతి వద్దకు వెళ్ళి, "మహాత్మా, నహుషుడు చాలా కోపంగా ఉన్నాడు. శచీదేవిని అతని భార్యగా ఉండమని ఒప్పించు. లేకపోతే లోకాలకు క్షేమం లేదు," అన్నారు.

"నేను ఎన్ని బాధలైనా పడతాను గాని నహుషుడికి భార్యగా ఉండను," అన్నది శచీదేవి. బృహస్పతి కూడా, శరణుజొచ్చిన శచీదేవిని రక్షించి తీరతానన్నాడు.

ఆ పరిస్థితిలో, నహుషుడి ఆగ్రహం చల్లారేటట్టూ, శచీదేవికి ఇబ్బంది కలగ కుండా ఉండేటట్టూ ఒక ఉపాయం ఆలో చించవలసి వచ్చింది.

"నహుషుడు గర్వోన్మత్తుడై, పతనం కావటానికి తగిన స్థితిలో ఉన్నాడు. అందు చేత, ప్రస్తుతానికి శచీదేవి అతని వద్దకు వెళ్ళి, కొంత వ్యవధి అడిగి వస్తే, ఈ సమస్యను కాలమే తీర్చవచ్చు," అని బృహస్పతి దేవతలతో అన్నాడు.

45. రాయబారాలు



అ ప్రకారమే శచీదేవి నహుషుడి వద్దకు వెళ్ళి, "ఇంద్రుణ్ణి గురించి ఏ వార్తా తెలియటం లేదు. ఏ సంగతీ తెలియగానే నీకు భార్యను అవుతాను," అన్నది.

ఈ లోపల మునులు ఇంద్రుణ్ణి పట్టుకుని పాపక్షయం కోసం అశ్వమేధం చేయించారు. ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వచ్చి, నహుషుడి తేజస్సు చూసి భయపడి, మళ్ళీ ఎటో పారిపోయాడు. శచీదేవి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళి, "దుర్మార్గుడైన నహుషుణ్ణి వెంటనే చంపి నీ ఇంద్రత్వం నువ్వు తిరిగి పొందు," అని కోరింది.

"నహుషుణ్ణి ఇప్పుడు బలంతో గెలవటం సాధ్యం కాదు. ఉపాయంతో గెలవాలి. ఆ ఉపాయం నీ చేతిలో ఉన్నది. నహుషుడు నిన్ను కోరుతున్నాడు గనక, ఋషుల చేత మోయించుకుని నీ ఇంటికి రమ్మని నహుషుడితో చెప్పు. దానితో నహుషుడు పతనమవుతాడు," అన్నాడు ఇంద్రుడు.

ఋషుల చేత మోయించుకుని తన వద్దకు రమ్మని శచీదేవి అడగగానే నహుషుడు పరమానంద భరితుడై, మునుల చేత పల్లకీ మోయిస్తూ బయలుదేరాడు. దారిలో మునులు అతనితో ఏదో వాదం వేసుకున్నారు. నహుషుడు ఆగ్రహించి అగస్త్యుడి తలను తన కాలితో తన్నాడు. అగస్త్యుడు కోపించి, పాము కమ్మని నహుషుణ్ణి శపించాడు. దానితో నహుషుడు స్వర్గభ్రష్టుడయ్యాడు. ఇంద్రుడు తిరిగి తన పదవి సంపాదించుకుని, శచీదేవితో సుఖంగా ఉన్నాడు.

శల్యుడు ధర్మరాజుకు ఈ కథ చెప్పి, దుర్యోధనుడి వద్దకు వెళ్ళిపోయాడు.

ద్రుపదుడి పురోహితుడు పాండవుల దూతగా హస్తినాపురానికి చేరే లోపుగా పాండవ కౌరవ పక్షాల చేరవలసిన వారు సేనలతో సహా వచ్చి చేరారు.

పాండవుల పక్షాన యుద్ధం చెయ్యటానికి ఏడు అక్షౌహిణుల సేన ఉపప్లావ్యంలో చేరింది. మహారథుడైన యుయుధానుడు ఒక అక్షౌహిణీ సేన తెచ్చాడు. చేదిరాజైన ధృష్టకేతుడు కూడా అంత సేనతో వచ్చాడు. పాండ్య దేశపు రాజు పర్వతప్రాంతీయులైన యోధులతో ధర్మరాజుకు సహాయం వచ్చాడు. ద్రుపదుడు అనేక దేశాలకు చెందిన యోధులనూ,

మహారథులైన తన కొడుకులనూ వెంట బెట్టుకుని పెద్ద సేనతో వచ్చాడు. మత్స్య దేశపు రాజైన విరాటుడు గిరిజన సైనికులను తనవెంట తెచ్చాడు.

అదే సమయంలో, దుర్యోధనుడి పక్షాన పాండవులతో యుద్ధం చెయ్యటానికి పదకొండు అక్షౌహిణుల సేన ఆయత్త మయింది. నరకాసురుడి కొడుకైన భగ దత్తుడు చీన కిరాతులతో కూడిన ఒక అక్షౌహిణి సేనను వెంటబెట్టుకుని దుర్యో ధనుణ్ణి చేరాడు. అది మహా బలసంపన్న మైన సేన. అలాగే భూరిశ్రవసుడూ, శల్యుడూ చెరొక అక్షౌహిణీ సేనా తెచ్చారు. ఆకులూ, పూలూ కలిపి కట్టిన కదంబ మాలలు ధరించిన ఏనుగుగున్నల లాటి యోధులను కృతవర్మ తెచ్చాడు. సింధు సౌవీర దేశాల నుంచి జయద్రధుడు (సైంధవుడు) మొదలుకుని అనేకమంది రాజులు దుర్యోధనుడి వద్దకు వచ్చారు. వారి సేనలు ఒక అక్షౌహిణి ప్రమాణంలో ఉన్నాయి. దక్షిణాన మాహిష్మతీపురం నుంచి నీలుడు భయంకరమైన ఆయుధాలు ధరించిన గొప్ప యోధులను వెంటబెట్టుకు వచ్చాడు. అవంతి దేశపు రాజులు రెండు అక్షౌహిణుల సేన తెచ్చారు. కేకయ దేశపు రాజులు, ఒక అక్షౌహిణి సేన తెచ్చారు. ఇంకా ఇతర దేశాల నుంచి వచ్చిన చిల్లర సేనలన్నీ కలిసి మూడు అక్షౌహిణులు అయ్యాయి.

దుర్యోధనుడి పక్షాన వచ్చిన రాజులకే హస్తినాపురంలో చోటు చాలలేదు. ఇక వారి సేనల మాట చెప్పనే అవసరం



లేదు: ఆ సేనలను పంచనదంలోనూ, గురుజాంగలంలోనూ, రోహితకారణ్యాల లోనూ, మరుభూమిలోనూ, అహిచ్ఛత్రం లోనూ, కాలకూట గంగా కూటాల లోనూ, వారణంలోనూ, వాటధానంలోనూ, యమునా తీరానా సర్ది, శిబిరాలు ఏర్పరచారు.

ఈ విధంగా అక్కడక్కడా విడిసి ఉన్న సేనలను చూసుకుంటూ ద్రుపదుడి పురోహితుడు హస్తినాపురం చేరి, ధృతరా ష్ట్రుడి సభాభవనానికి వెళ్ళాడు. ఆ వృద్ధబ్రాహ్మణుడికి విదురుడూ, భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ మర్యాదలు జరిపి, పాండవులను గురించి కుశల ప్రశ్నలు చేశారు. ఆ బ్రాహ్మణుడు కూడా దుర్యోధ నాదుల కుశలం అడిగి, నిండు సభలో అందరూ వింటూండగా ఇలా అన్నాడు:



"సభాసదులారా! ధృతరాష్ట్రుడూ, పాండురాజూ ఒకరి బిడ్డలే. తండ్రీ తాతల ఆస్తిలో ఇద్దరికీ సమభాగం ఉన్నది. అలాటప్పుడు ధృతరాష్ట్రుడి కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించుతూ ఉండటానికీ, పాండురాజు కొడుకులు తమ తండ్రి ఆస్తి అనుభవించకపోవటానికీ కారణం ఏమిటి? పాండవులు తమ ఆస్తి అనుభవించకుండా దుర్యోధనుడు వారినెన్ని బాధలు పెట్టినదీ మీరు మరచిపోలేరు. పాండవుల ఆయువు గట్టిది కాకపోతే వారు ఏనాడో చచ్చిపోయి ఉందురు. అంతేకాదు; పాండవులు తమ స్వశక్తితో గెలుచుకున్న రాజ్యాన్ని కూడా ధృతరాష్ట్రుడి కొడుకులు మాయజూదంలో కాజేశారు. పాపాల భైరవుడు శకుని వారి దుర్మార్గాలకు సహాయపడ్డాడు. పదమూడేళ్ల పాటు పాండవులు తమ భార్యతో సహా అరణ్యాలలో పడరాని పాట్లు పడ్డారు. విరాట నగరంలో వారు గడిపిన జీవితం చెప్పదగినదీ వినదగినదీ కాదు. ఇంత జరిగినా పాండవులు కౌరవులతో శాంతి కోరుతున్నారు. వారికి కౌరవులతో యుద్ధం చెయ్యాలన్న కోరిక లేదు. యుద్ధం వల్ల జనక్షయం కలుగుతుంది. ఎవరికీ ఏ మాత్రమూ కీడు రాకుండా తమ రాజ్యభాగాన్ని తాము తిరిగి పొందాలని వారి కోరిక. దుర్యోధనుడికి తన బలంలో తనకు అమితమైన నమ్మకం ఉన్నది. దానికి తోడు అంతులేని సైన్యాలు వచ్చి చేరాయి గనక, తాను గెలుస్తానని అతను భ్రమపడుతున్నాడు. దుర్యోధనుడి సేనలో నాలుగు అక్షౌహిణులుంటే ఏమయింది? పాండవ సేనలో సాత్యకీ, భీముడూ, నకుల సహదేవులూ ఒక్కొక్క అక్షౌహిణికి సమానులు. అర్జునుడు ఒక్కడే ఇన్ని అక్షౌహిణుల ఎత్తు. అలాటి వాడే కృష్ణుడు. ఇలాటి బలసంపద గల పాండవులపై బుద్ధిగల వాడెవడూ యుద్ధం తలపెట్టడు. పాండవులతో సఖ్యం చెయ్యటానికి ఈ తరుణం మించిపోతే మరిరాదు."

ద్రుపదుడి పురోహితుడు ఇలా చెప్పిన మీదట భీష్ముడు, "బ్రాహ్మణోత్తమా, నీ మాటలు కటువుగా ఉన్నా వాటిలో నిజం ఉన్నది. పాండవులు యుద్ధానికి సిద్ధం కావటమూ, శాంతిని కోరటమూ కూడా ఉచితమే. పాండవులు అష్టకష్టాలూ పడిన మాట అబద్ధం కాదు. అర్జునుడు అనేక అస్త్రాలు తెలిసిన మహాయోధుడు. వజ్రా

యుధం గల ఇంద్రుడే అతనికి ఎదురు నిలవలేడు, మిగిలిన వారి మాట చెప్పే దేమిటి?" అన్నాడు.

భీష్ముడి మాట పూర్తి కాకుండానే కర్ణుడు లేచి, "బ్రాహ్మణోత్తమా, మీరు చెప్పినదంతా అందరికీ తెలిసినదే. ధర్మరాజు తాను ఆమోదించిన నియమం ప్రకారమే, జూదంలో ఓడి అరణ్యాలకు పోయాడు. పోయినవాడు మూర్ఖుడిలాగా ఇప్పుడు మళ్ళీ రాజ్యం అడుగుతున్నాడు. పాండవుల బలానికి బెదిరి దుర్యోధనుడు వారికి ఒక్క అడుగు మోపినంత భూమి కూడా ఇయ్యడు. వారికి నిజంగా రాజ్యం కావాలంటే తిరిగి వనవాసం చెయ్యాలి. రాజ్యం కోసం ధర్మం విడిచి వారు యుద్ధానికి తలపడ్డారు," అన్నాడు.

భీష్ముడు చిరాకుపడి, "కర్ణా, ఎందుకీ వ్యర్థపు మాటలు? అర్జునుడు ఒంటరిగా మనలనందరినీ అవలీలగా ఓడించిన సంగతి అప్పుడే మరిచావా? ఈ బ్రాహ్మణుడు చెప్పిన ప్రకారం చెయ్యకపోతే అర్జునుడి కోపాగ్నికి మనమంతా రెక్కపురుగుల్లాగా మాడి చస్తాం," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కల్పించుకుని, కర్ణుణ్ణి మందలించి, భీష్ముడు అందరికీ మేలుకోరే మాట్లాడాడని అతన్ని హెచ్చరించి, ద్రుపదుడి పురోహితుడితో, "అయ్యా, నేను బాగా ఆలోచించి, నా సమాధానం పాండవులకు సంజయుడి ద్వారా అందజేస్తాను. మీరు పాండవుల వద్దకు తిరిగి వెళ్ళండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుణ్ణి సగౌరవంగా సాగనంపి, సంజయుణ్ణి పిలిపించి,



"సంజయా, నువ్వు వెంటనే బయలుదేరి ఉపప్లావ్యానికి వెళ్ళి, ధర్మరాజును కలుసుకుని క్షేమం అడిగి, వాళ్ళు కష్టాల నుంచి బయటపడినందుకు అభినందించు. తరవాత కృష్ణుణ్ణీ, పాండవులకు యుద్ధంలో సహాయం వచ్చిన ముఖ్యులనూ పలకరించు. మన మూలాన పాండవులు అనేక కష్టాలు పడ్డారు. వారివల్ల ఒక్క కీడు కూడా మనకు కలిగినట్టు నాకు గుర్తు రావటం లేదు. ధర్మరాజు మన మీద అలిగి యుద్ధం చేస్తాడని తలుచుకుంటే నాకు భయంగా ఉన్నది. భీమార్జునులు యుద్ధంలో ఎదురులేని వాళ్ళు. నువ్వు వారితో ఏం చెబుతావో నీ ఇష్టం! యుద్ధం జరగకుండా ఏదో ఒకటి చెప్పి, పాండవ పక్షం వారిని ఒప్పించు," అన్నాడు.



సంజయుడు రథం మీద ఉపప్లావ్యం చేరి, ధర్మరాజును కలుసుకున్నాడు. ఇద్దరూ ఉభయపక్షాల వారి క్షేమం అడిగి తెలుసుకున్న అనంతరం సంజయుడు, అందరూ వింటూండగా ఈ విధంగా తెలిపాడు:

"ధృతరాష్ట్రుడు శాంతి కోరి నన్ను పంపాడు. పాండవులు శాంతించాలి. వారిని లోకం ఆదర్శపురుషులుగా భావిస్తున్నది. అలాటప్పుడు వారిలో ఎలాటి కల్మషం కనిపించినా అది నూరింతలు అనిపిస్తుంది. జయాపజయాలు నిర్ణయించటానికి వీలు లేని యుద్ధం ఎంత మాత్రమూ కోరదగినది కాదు. కౌరవులను చంపి రాజ్యం తీసుకుందామనుకోవటం యోగ్యమైనది కాదు. జ్ఞాతులను చంపటం కన్న మరణం మేలు. పాండవబలం దేవతలకైనా జయించరానిది. అలాటిదే కౌరవబలం కూడా. ఈ రెండు బలాలకూ యుద్ధం జరిగితే ఎవరు జయించినా ఒకటేననీ, కొంచెమైనా సుఖం ఉండదనీ నా నమ్మకం. పాండవుల వంటి వారు ధర్మార్థాలకు దూరమైన హీనమార్గం తొక్కరనుకుంటాను. శాంతి చేకూరేటట్టు చూడమని మీ అందరినీ చేతులు మోడ్చి ప్రార్థిస్తున్నాను."

సంజయుడు ఇలా అన్న మీదట ధర్మరాజు, "సంజయా, నేను యుద్ధం కోసం తపించిపోతున్నట్టు మాట్లాడానా? శాంతి వల్ల సమకూరేదానికి యుద్ధం చేసే మూర్ఖుణ్ణి కాను. బుద్ధిమంతుడైనవాడు తన సుఖం గురించి ఆలోచించినట్టే పరుల సుఖం గురించి కూడా ఆలోచించాలి. కారడవిలో, చిచ్చురేపి కార్చిచ్చు ప్రజ్వలిస్తుంటే, 'అయ్యో నాకు అపాయం!' అనే వాడు మూఢుడు కాడా? దుర్మార్గుడైన దుర్యోధనుణ్ణి సమర్థించుతూ ధృతరాష్ట్రుడు ఎలా సుఖం పొందగలడు? కపట జూదం ఆడిన నాడే కౌరవుల వినాశం ఆరంభమయింది. కాని కౌరవులతో శాంతంగా సహజీవనం చెయ్యటానికి నాకు అభ్యంతరం లేదు. వారు మాకు చేసిన ద్రోహాలన్నీ మరచిపోతాను. నాకు ఇంద్రప్రస్థం మటుకు ఏలుకోవటానికి ఇయ్యమను. దుర్యోధనుణ్ణే రాజరాజుగా ఉండనీ," అన్నాడు.

దానికి సంజయుడు, "ధర్మరాజా, నువ్వు ఎన్నడూ ధర్మం తప్పి ఎరగవు.

తుచ్ఛమైన రాజ్యభోగం కోసం నీ కీర్తిని శాశ్వతంగా కళంక పరచుకుంటావా? యుద్ధం ఆలోచన మాను. కౌరవులు నీకు రాజ్యభాగం ఇయ్యరు. అందువల్ల యుద్ధం చేసి రాజ్యం పొందేకన్న, నువ్వూ, నీ తమ్ములూ యాచనా వృత్తితో జీవించటం ఎంతో కీర్తికరమైనది," అన్నాడు.

సంజయుడు ధర్మాధర్మాలను గురించి చెప్పినది ధర్మరాజు ఒప్పుకోక, ఆపద్ధర్మం ఉంటుందనీ, ఆపదల నుంచి బయట పడటానికి అధర్మం చెయ్యటం కూడా ధర్మమేనన్నాడు; తనకు కృష్ణుడు ఏది చెబితే అదే ధర్మమన్నాడు.

కృష్ణుడు సంజయుడితో, "నువ్వు శాంతి, శాంతి అని అంటున్నావు. రాజులకు యుద్ధం చెయ్యటం ధర్మం కాదంటావా? అధర్మానికి పాల్పడిన వాళ్ళు ధృతరాష్ట్రుడి కొడుకులు. దుర్యోధనుడు పాండవుల సొత్తు అధర్మంగా హరించాడు. అందులో రాజధర్మం ఏమున్నది? దొంగకూ, దుర్యోధనుడికీ భేదమేమిటి? ఇన్నాళ్ళూ అతను పాండవుల ఆస్తి అనుభవించాడు! ఇప్పుడు వారి సొత్తు వారికెందుకు ఇయ్యడు? పరుల రాజ్యం అనుభవించే కంటే సొంత రాజ్యం వెయ్యిరెట్లు మంచిది. దానికోసం యుద్ధం చేసి చావటమైనా మాకు ఇష్టమే. కౌరవ సభలో ఈ మాట గట్టిగా చెప్పు," అన్నాడు.

సంజయుడు తనవల్ల తప్పులేవైనా ఉంటే క్షమించమని అందరినీ కోరి, అందరి వద్దా సెలవు పుచ్చుకుని బయలుదేరబోతూండగా ధర్మరాజు, "సంజయా, మేము నిజంగా శాంతినే కోరుతున్నాము. ధృతరాష్ట్రుడు కూడా శాంతినే కోరే పక్షంలో, మాకు రాజ్యంలో కొంత భాగమైనా ఇయ్యమను. మా అయిదుగురికీ అయిదు ఊళ్ళు ఇయ్యమను. కుశస్థలమూ, వృకస్థలమూ, మాకందీ, వారణావతమూ అనే ఊళ్ళకు తన ఇష్టం వచ్చిన ఊరు మరొకటి కలిపి ఇయ్యమను. అందరమూ సుఖంగా ఉండవచ్చు. నేను శాంతికి ఎంత సంసిద్ధుణ్ణో, యుద్ధానికి కూడా అంత సంసిద్ధుణ్ణే," అన్నాడు.

ఈ సందేశం కూడా తీసుకుని సంజయుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయాడు.



# చందమామ కబుర్లు

## వేగంలో 'రికార్డు'

డిసెంబర్ 6వ తేదీ జపానులో డ్రైవరు లేకుండా ఒక రైలు గంటకు 531 కి.మీ. వేగంతో నడిచి రికార్డు సృష్టించింది. సన్నగా మరీ నున్నగా మిలమిలలాడుతూ అందంగా కనిపించే 'మాగ్లేవ్' అనే ఈ రైలు టోక్యో సమీపంలోని యామనాషీలో 18.5 కి.మీ. దూరం రైలు పట్టాల మీద నడిచింది.



అంతకు పూర్వం రికార్డు గంటకు 517 కి.మీ. అయితే ఇదే 'మాగ్లేవ్' యామనాషీలోనే డిసెంబర్ 24వ తేదీ గంటకు 550 కి.మీ. వేగంతో నడిచి సరికొత్త రికార్డు సృష్టించింది!

## జైల్లో సుదీర్ఘ జీవితం!

మామూలుగా భయంకరమైన నేరాలకు మరణ దండన లేదా యావజ్జీవ కారాగారశిక్ష విధిస్తారు. పేరుకు యావజ్జీవ కారాగారశిక్షేగాని ఈ శిక్ష పొందినవాళ్ళు జీవితాంతం జైల్లో గడపవలసిన అవసరం లేదు. చాలా దేశాలలో యావజ్జీవ శిక్ష అంటే అధిక పక్షం 21 సంవత్సరాలు. మామూలుగా ఈ శిక్షాకాలం లోపలే నేరస్థులలో మానసిక పరివర్తన వస్తుందనీ, సమాజం కూడా వాళ్ళను క్షమించి సాటి మానవులుగా అంగీకరిస్తుందనీ న్యాయవేత్తలు భావిస్తున్నారు. దక్షిణ ఆఫ్రికాకు చెందిన మోసస్ సిటాల్ 38 హత్యలు; స్త్రీలపై అత్యాచారాలు 40; 6 దొంగతనాలు చేశాడని రుజువు కావడంతో వాడికి న్యాయస్థానం గత డిసెంబర్‌లో 2,410 సంవత్సరాల జైలుశిక్ష విధించింది. ముప్పై మూడేళ్ళ మోసస్ అత్యాచారాలకు గురైనవారిలో ఎక్కువ మంది 20-30 సంవత్సరాల మధ్య వయస్కులే. జైలుశిక్ష వాడి ప్రవర్తనలో మార్పు తెస్తుందో లేదో; న్యాయస్థానం వాడి శిక్షాకాలాన్ని తగ్గిస్తుందో లేదో వేచి చూడాలి!

## టర్కీ 'నిదురించిన వేళ'!

మన దేశంలో నూతన దశాబ్దం తొలి సంవత్సరం మొదటి రోజున జనాభా లెక్కలు సేకరించడం మొదలు పెడతారు. జనాభా లెక్కలు సేకరించే ప్రభుత్వోద్యోగులు ఇంటింటికీ వెళ్ళి వివరాలు సేకరిస్తారు. వెళ్ళిన సమయంలో ఆ ఇంటి యజమాని లేనట్టయితే ఒక్కొక్క ఇంటికి రెండు మూడు సార్లు వెళ్ళవలసి వస్తుంది. ఆ విధంగా సేకరించిన జనాభా వివరాలతో, విశ్లేషణలతో ప్రభుత్వానికి నివేదిక సమర్పించడానికి ఒక సంవత్సరం పడుతుంది. టర్కీ ఒక్కరోజులో జనాభా లెక్కల సేకరణను పూర్తి చేయాలని నిర్ణయించింది. నవంబర్ 30యవ తేదీ మెరుపు వేగంతో జనాభా లెక్కల సేకరణ జరిగింది. అదొక ఆదివారం. ఆ రోజు ఎవరుగాని ఇళ్ళల్లో వున్నా, ఆస్పత్రులలో వున్నా, హాస్టల్స్‌లో వున్నా ఉదయం 5 గంటల నుంచి 14 గంటల సేపు బయట అడుగుపెట్టరాదని ప్రభుత్వం ముందే ప్రకటించింది. ప్రభుత్వం ఆజ్ఞను అతిక్రమించి వీధిలోకి వచ్చినట్టయితే ఆరునెలల కారాగార శిక్ష అని హెచ్చరించింది. జనాభా లెక్కలు సేకరించేవారు, పోలీసులు తప్ప మరెవ్వరూ వీధులలో కనిపించలేదు. ఆ విధంగా టర్కీ ఒక రోజంతా 'నిదురించిందని' పత్రికలు పేర్కొన్నాయి!

చందమామ అనుబంధం 112



మన దేశపు అందచందాలు

# బంజారా తెగ



ఔరంగజేబు దండయాత్ర కారణంగా బంజారాలు రాజస్థాన్ నుంచి దక్కను ప్రాంతానికి వలస వచ్చారు. బంజారా జాతికి రెండువేల సంవత్సరాల చరిత్ర ఉన్నది. ఐరోపా ఖండంలోని రోమనీ జిప్సీలు - కొందరు ఆఫ్ఘన్ కొండల గుండా భారతదేశానికి వచ్చి రాజస్థాన్‌లో స్థిరపడినట్టు చెబుతారు. మొగలుల ఆయుధాలు, గుడారాల సామగ్రి మోసే వాహకులుగా బంజారాలు పనిచేశారు. మొదట ఆంగ్లేయులకు గూఢచారులుగా పని చేసినప్పటికీ ఆ తరవాత వీరిలో కొందరు టిప్పుసుల్తానుకు సాయపడ్డారు.

బంజారాలకు సంచార జీవనం అంటే చాలా ఇష్టం. జీవనోపాధి వెతుక్కుంటూ ఒక చోటి నుంచి మరొక చోటికి వెళుతూ ఉంటారు. మట్టికుండలు, సత్తు పళ్ళాలు, తట్టలు, బుట్టలు, చాపలు ఇవే వీరి ఆస్తులు. అందరూ కలిసి తమలో ఒకరిని నాయకుడిగా ఎన్నుకుంటారు.

హిందువుల మత విశ్వాసాలను కొన్నిటిని విశ్వసించే వీరికి పండుగలంటే చాలా సంబరం. తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామిని తమ కులదైవంగా కొలుస్తారు. బంజారా స్త్రీలకు సహజంగానే ఆటపాటలంటే మహా ఇష్టం. రంగురంగుల బట్టలు ధరిస్తారు. తలపై ముసుగుతో, పాదం వరకు పైట ధరిస్తారు. బట్టలపై అల్లికలు చేసుకుంటారు. చీరలపై, రవికలపై చిన్నచిన్న అద్దం ముక్కలను కుట్టించుకుంటారు. మోచేతుల వరకు గాజులు; వెండి, ఇత్తడి, కంచు, దంతం, బంగారం ఆభరణాలు ఒంటినిండా ధరిస్తారు. పురుషులు మాత్రం పంచ, పైన చొక్కా, తలపాగా ధరించి మామూలు రైతుల్లాగా ఉంటారు.

పురాణకాలంనాటి రాజులు:

# మయూరధ్వజుడు

ద్వాపర యుగాంతంలో మణిపురమనే రాజ్యాన్ని మయూరధ్వజుడనే రాజు పాలించేవాడు. ఆయన ధర్మపరుడు; ప్రజల బాధలను తన బాధలుగా భావించి, వారికి ఎటువంటి కొరతా రాకుండా కాపాడేవాడు.

మయూరధ్వజుడు యాగం చేయతలపెట్టి, యాగాశ్వాన్ని విజయయాత్రకు పంపాడు. యాగాశ్వం వెంట ఆయన కుమారుడు తామ్రధ్వజుడని పేరు గాంచిన సుచిత్రుడు బయలుదేరాడు.

ఆ సమయంలోనే ధర్మరాజు కూడా అశ్వమేధ యాగం చేయతలపెట్టి అశ్వాన్ని విజయ యాత్రకు పంపాడు. యాగాశ్వం వెంట కృష్ణార్జునులు బయలుదేరారు.

రెండు యాగాశ్వాలు ఒకదానికొకటి ఎదురైనప్పుడు సుచిత్రుడు కృష్ణార్జులను స్పృహ కోల్పోయేలా చేసి, వారిని దాటుకుని వెళ్ళాడు. కొంతసేపటికి కృష్ణార్జునులు నిద్ర మేల్కాంచి విషయం గ్రహించారు. తమనే స్పృహ కోల్పోయేలా చేసిన ఆ రాకుమారుడి తండ్రి ఎలాంటివాడో చూడాలన్న ఉత్సాహం వారికి కలిగింది.



ఇరువురూ బ్రాహ్మణ రూపాలు ధరించి మణిపురికి వెళ్ళారు. మయూరధ్వజుడు వారికి అతిథి సత్కారాలు చేసి వచ్చిన పని అడిగాడు.

"మార్గమధ్యంలోని అరణ్యంలో ఒక సింహం నా కుమారుణ్ణి పట్టుకున్నది. 'నీ ఆకలికి నన్ను భక్షించి, నా కుమారుణ్ణి వదిలిపెట్టు' అని వేడుకున్నాను. దానికది, 'నిన్ను నేను భక్షించను. కావాలంటే రాజు మయూరధ్వజుడి అర్ధ శరీరం తీసుకురా, నీ కుమారుణ్ణి వదిలిపెడతాను, అన్నది," అన్నాడు బ్రాహ్మణ రూపంలోని కృష్ణుడు.

ఆ మాటలకు మయూరధ్వజుడి భార్య, "అర్ధాంగి అంటే భర్త శరీరంలో సగం అనే కదా అర్థం. కాబట్టి సింహానికి ఆహారంగా నన్ను స్వీకరించండి. రాజుగారిని వదిలిపెట్టండి!" అని ప్రార్థించింది.

అందుకు కృష్ణుడు, "భార్య, భర్తకు వామ భాగమవుతుంది. అయితే, సింహం రాజుగారి శరీరంలోని కుడిభాగాన్ని కోరుతున్నది!" అన్నాడు.

"అలాగే నా శరీరం కోసి, కుడిభాగాన్ని తీసుకోండి!" అన్నాడు మయూరధ్వజుడు.

కృష్ణుడు ఆ పనికి ఉపక్రమించబోగా, రాజు ఎడమ కంటి నుంచి నీరు కారడం గమనించి, "ఏడుస్తూ ఇచ్చే ఈ దానం నాకు వద్దు. మనస్ఫూర్తిగా ఇచ్చేదే దానం!" అన్నాడు.

"మహాత్మా! నా శరీరంలోని కుడి భాగం ఒక సత్కార్యానికి ఉపయోగపడుతున్నది. ఆ భాగ్యం తనకు కలగలేదన్న బాధతో ఎడమ కన్ను విలపిస్తున్నది. మరొకటి కాదు!" అన్నాడు రాజు.

మరుక్షణమే కృష్ణుడు నిజరూపంలో ప్రత్యక్షమై మయూరధ్వజుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకుని, ఆయన ధర్మనిరతినీ, దానగుణాన్నీ మెచ్చుకున్నాడు. ఆయన యాగం పూర్తయ్యేంతవరకు అక్కడే వుండి ఆ తరవాత ధర్మరాజు యాగం చేసే స్థలానికి మయూరధ్వజుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళాడు.

## మీకు తెలుసా?

# యూనికార్న్



యూనికార్న్ కల్పితమైన ఒక పురాతన జంతువు. అయితే, చాలాకాలం క్రితం, అటువంటి జంతువు నిజంగానే ఉండేదని విశ్వసించే వారు. బ్రిటిష్ రాజరికపు చిహ్నాలలో డాలుకు ఒకవైపున సింహం, మరొకవైపున యూనికార్న్ చెక్కబడి ఉండేవి. నుదుటి మీద ఒంటి కొమ్ముగల వింత గుర్రం ఆకారంలో ఉంటుంది యూనికార్న్. మొదటి ఎలిజెబెత్ రాణి దగ్గర యూనికార్న్ కొమ్ము ఉండేదనీ, అది చాలా విలువైనదనీ, దానికి మనుషులను విషం నుంచి కాపాడే అద్భుత శక్తులు ఉండేవనీ చెప్పుకునే వారు. పురాణాల ప్రకారం సింహం-యూనికార్న్ బద్ధ శత్రువులు. ఎదురు పడినట్టయితే ఒక దాని నొకటి చీల్చి చెండాడకుండా వదిలి పెట్టవు. అందువల్లనే డాలు మీద కూడా అవి విడివిడిగా చెక్కబడి వున్నాయి. బ్రిటిష్ రాజరికపు చిహ్నాలలో వాటికి సముచిత స్థానం కల్పించబడింది.

# ఇంద్రధనుస్సు

## అద్దాల గవాక్షం



అద్దాల కళాకారులు అద్దం, సీసం, రంగులు ఉపయోగించి ముతక అద్దాల గవాక్షాలు తయారు చేస్తారు. మొదట వాళ్ళు గవాక్షం రేఖాచిత్రాన్ని గీసుకుంటారు. దీనిని 'కార్టూన్' అంటారు. ఇవి సీసం రేఖలనూ, అద్దాల రంగులనూ సూచిస్తాయి. మధ్య యుగాలలో ఈ మందమైన అద్దాలను ఈ కళాకారులు తమ కర్మాగారాలలోనే తయారు చేసుకునేవారు. కాని ఇప్పుడు ఇవి కావలసిన రంగులలో లభిస్తున్నాయి. 'కార్టూన్' పూర్తయిన తరవాత అద్దాలను కావలసిన సైజులలో కత్తిరించుకుని వాటిని సీసం గీతల మీద వుంచి వేడిచేసి అతికిస్తారు. అద్దం ఫ్రేము సిద్ధమయ్యాక దాని మీద సీసంతో చిన్నచిన్న డిజైన్లను అతికిస్తారు. మధ్యయుగాలలో పలువురు నిరక్షరాస్యులు కాబట్టి ఈ అద్దాల గవాక్షాలు చర్చి సమావేశాలలో బొమ్మల పుస్తకాలుగా ఉపయోగపడేవి!

# ముందుచూపు

హేలాపురిలో, నాగేశ్వరుడనే సామాన్య కుటుంబీకుడుండేవాడు. అతడికి భార్య, ఇద్దరు పిల్లలు. ఒకే ఒక చెల్లెలిని, సుగంధపురి నివాసి వీరేశానికిచ్చి పెళ్ళి చేసి, అత్తవారింటికి పంపాడు. ఈ వీరేశం కూడా సామాన్య కుటుంబీకుడే.

కొంత కాలం గడిచాక, వీరేశం తీవ్రమైన గుండెజబ్బుకు గురయ్యాడు. ఆ స్థితిలో నాగేశ్వరుడి భార్య సావిత్రి, భర్తను పోరి, వీరేశాన్ని తమ ఇంటికి తెప్పించుకున్నది. తర్వాత, ఒక మంచి వైద్యుడి చేత అతడికి చికిత్స చేయిస్తూ, వీరేశం భార్యతో పాటు తనూ అతడికి సపర్యలు చేసి, మూడు నెలల్లో ఆరోగ్యవంతుణ్ణి చేసింది.

వీరేశం, అతడి భార్య — నాగేశ్వరుడికీ, సావిత్రికీ తమ కృతజ్ఞతలు చెప్పుకుని, వాళ్ళ ఊరుకు వెళ్ళిపోయారు.

ఆ తర్వాత ఒకనాడు, నాగేశ్వరుడు, భార్య సావిత్రితో, "ఆడబిడ్డ మీదా, ఆవిడ భర్త మీదా ఇంత ప్రేమ చూపేవాళ్ళను నేనింతవరకూ చూడలేదు. సొంత అన్నకు చేసినట్టు వీరేశానికి సేవలు చేశావు. అంతేకాక, నాతో శతపోరి అతణ్ణి మన ఇంటికి రప్పించి మరీ వైద్యం చేయించావు. నీలో ఇంత దయాగుణం వున్నందుకు చాలా ఆనందంగా వున్నది," అన్నాడు.

ఆ మాటలకు సావిత్రి కిలకిలమంటూ నవ్వి, "నాలో మీరు చూసిన దయాగుణమే కాదు, మీరెరుగని వ్యవహారజ్ఞానం, ముందుచూపూ కూడా వున్నది!" అన్నది.

ఈ జవాబు అర్థంకాని నాగేశ్వరుడు తెల్లబోయి, "అదేమిటి?" అన్నాడు.

"చూడండి! ఆడబిడ్డ సుమంగళిగా వుండాలని, ఏ వదిన అయినా కోరుకుంటుంది. సామాన్య కుటుంబీకురాలైన ఆడబిడ్డ మాంగల్యాన్ని కోల్పోవడమంటే—పుట్టిల్లు చేరడం తప్ప మరే దారీ లేదు కదా! మీ బావకు ఏమైనా జరిగితే, అప్పుడు మీ చెల్లెలూ, ఆమె పిల్లలూ అందరూ మన పంచ చేరుతారు. అప్పుడు, వాళ్ళందరికీ మనం చాకిరీ చేయక తప్పదు గదా! ఇదంతా ఊహించి ముందే మీ బావగారికి సేవ చేసి, ఆరోగ్యవంతుణ్ణి చేశాను," అన్నది.

**— కోనే నాగవెంకట ఆంజనేయులు**



స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[కాన్పూరు తిరుగుబాటు తరవాత నానాసాహెబ్ మరాఠా రాజుగా అభిషిక్తుడైన విషయం బ్రిటిష్ కంపెనీ ప్రతిష్ఠను దెబ్బతీసింది. జనరల్ హేవ్‌లాక్ నాయకత్వంలో వేలాదిమంది బ్రిటిష్ సైనికులు కాన్పూరు మీద దాడి జరిపారు. కొంతవరకు వీరోచితంగా పోరాడి, ఇక యుద్ధంలో ఓటమి తప్పదన్న పరిస్థితి ఏర్పడగానే నానాసాహెబ్ తప్పించుకున్నాడు. పట్టుబడిన వాళ్ళందరినీ హేవ్‌లాక్ దారుణంగా హింసించి చంపాడు. అయినా బ్రిటిష్ పాలనకు దేశవ్యాప్తంగా మరింత వ్యతిరేకత బయలుదేరింది. —తరవాత]

మాహూలోని ఒక బ్రిటిష్ సైనిక శిబిరంలో ఆనందోత్సాహాలు చోటు చేసుకున్నాయి. వివిధ ప్రాంతాలలో వరుసగా అపజయాలనే ఎదుర్కొన్న బ్రిటిష్ సైనికులకు 1858వ సంవత్సరం ఆరంభం నూతన విశ్వాసాన్ని కలిగించింది.

ఆ శిబిరానికి నాయకుడుగా సర్ హగ్ రోజ్ అనే అనుభవజ్ఞుడైన సేనాధిపతి వచ్చాడు. అతనికి భారతదేశ చరిత్ర, ప్రస్తుత పరిస్థితులు బాగా తెలుసు. అతడు ఒక విశాల మంటపంలో అటూ ఇటూ పచార్లు చేస్తూ తన వెంటవున్న భారతీయ సిపాయిలు కొందరితో, "ఝాన్సీరాణి లక్ష్మీబాయి స్వయంగా సైన్యానికి నాయకత్వం వహించగలదని మీరు భావిస్తున్నారా? అటువంటి సాహసకృత్యానికి పూనుకున్న రాణిని గురించి నేను ఇంతకు ముందెన్నడూ వినలేదే!" అని అన్నాడు.




అక్షరాలా నిజం. ఆమె సామాన్య మహిళ కాదు. ఎవరినైనా సరే ఫిరంగులతో క్షణంలో పేల్చివేయవచ్చు, నిజమే. కానీ, అలా చేయడానికి ఆమె అవకాశం ఇస్తుందని మీరు కలలు కంటున్నారా? మీరు ఫిరంగులతో వెళితే ఆమె కూడా మిమ్మల్ని ఫిరంగులతోనే ఎదుర్కొంటుంది!" అన్నాడు.

"ఆమె దగ్గర ఎన్నిఫిరంగులు ఉంటాయి?" అని అడిగాడు హగ్‌రోజ్

"వాటిని మేము లెక్కించలేదు. అన్ని ఫిరంగులనూ ప్రదర్శనకు ఉంచలేదు కదా! అవన్నీ రాజభవనం తూర్పు దిశగా వున్న విశాల మంటపంలో-మందు గుండు సామగ్రి ఉన్న గిడ్డంగికి సమీపంలో ఉన్నాయి!" అన్నాడు వృద్ధుడైన ఆ సిపాయి.

హగ్‌రోజ్ రేఖాచిత్రం కేసి చూస్తూ, "అంటే నువ్వంటున్నది ఆ మర్రి చెట్టు వాలుతూ వున్న మంటపంలోనే కదా? దాని పక్కనే మందు గుండు సామగ్రి గిడ్డంగి కూడా ఉన్నదా?" అని అడిగాడు.

స్థానిక సిపాయిలు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అనుకోకుండా రాజభవనం రహస్యాన్ని బయటపెట్టామన్న అపరాధ భావం వాళ్ళ చూపులలో కనిపించింది.

"యజమానులకు విశ్వాసపాత్రులుగా ఉండాలన్నదే కదా మీ సంప్రదాయం! యజమానులను తల్లిదండ్రులకు సమానంగా గౌరవించే ఉన్నత సంప్రదాయం మీదన్న సంగతి మరిచిపోయారా? కంపెనీ మీకు యజమాని. మీకు కూడు, గుడ్డనిచ్చి పోషిస్తున్నది. దానికి సాయపడడం మీ బాధ్యత. అంతేకాదు; మీరు మీ బాధ్యతను

"అవును ప్రభూ! ఆమె అసాధారణమైన ధైర్య సాహసాలు గల రాణి!" అన్నాడు ఒక సిపాయి.

సర్ హగ్ రోజ్ నవ్వుతూ, "అసాధారణ మైన ధైర్యసాహసాలు గల రాణి! తీవ్రమైన కంఠస్వరంతో అమాయకులను బెదిరిస్తూ తిరిగే ఆ స్త్రీ, స్థానికులైన మీకు అసాధారణ మైన ధైర్యసాహసాలు గల రాణిగా కనిపించ వచ్చు. కాని యుద్ధరంగంలో కావలసిన ధైర్యసాహసాలు వేరు. ఎంత కాలమని ఆమె మన ఫిరంగులను ఎదుర్కోగలదు? ఒక్క క్షణంలో పేలిపోగలదు!" అన్నాడు.

రెండవ సిపాయి అతని అభిప్రాయంతో ఏకీభవించలేక పోయాడు. "ప్రభూ! మేము మీ సేవకులం. మీకు విశ్వాసపాత్రులుగా ఉంటున్నాం. మేము చెప్పిన విషయం

సక్రమంగా నిర్వహించారంటే దానికి తగిన బహుమతి కూడా ఉంటుంది!" అంటూ హగ్‌రోజ్ సిపాయిల వెన్ను చరిచి వారి చేతుల్లో బంగారు నాణాలు ఉంచాడు.

★ ★ ★

ఝాన్సీరాణి లక్ష్మీబాయి రాజభవనంలో సైనికాధికారులనూ, పురప్రముఖులనూ ఉద్దేశించి, "బంధుమిత్రులారా! పెద్దలారా! సోదరులారా! బిడ్డలారా! మన నగరంలోని ఒక కంపెనీ కార్యాలయాన్ని ధ్వంసం చేసినంతనే మనకు కంపెనీ పీడ విరగడై మనం స్వతంత్రులమై పోయినట్టు మీలో పలువురు భావిస్తున్నారు. అది సరి కాదు. సప్తసముద్రాల కావల నుంచి వచ్చిన వాళ్ళు ఒకటి రెండు ఎదురుదెబ్బలతో తిరిగి వెళ్ళరు. రక్తం పీల్చే జలగల్లా వాళ్ళు మన మాతృభూమిని అంటుకుని ఒక పట్టాన వదిలిపెట్టరు. బ్రిటిష్ సేనలు మన ఝాన్సీకేసి వస్తున్నాయని ఇప్పుడే వార్త అందింది. ఈ తరుణంలో మన కర్తవ్య మేమిటో సెలవివ్వండి. మీ సలహా కోరుతున్నాను!" అన్నది గంభీర స్వరంతో.

సభికులెవ్వరూ సమాధానం ఇవ్వలేదు. కొంతసేపు ఆవహించిన నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ రాజకుటుంబానికి చెందిన ఒక వృద్ధుడు లేచి నిలబడి, "తల్లీ! మేము ఉన్నది తమకు సలహాలివ్వడానికి కాదు; తమ ఆజ్ఞలను పాటించడానికే!" అన్నాడు.

"చాలా సంతోషం. ఈ భూమిపై జన్మించిన వీరకుమారులయిన మీరు, మాతృభూమి గౌరవం కాపాడడానికి మీ మాతృభూమిని రక్త తర్పణంతో పునీతం చేయ



డానికి సైతం వెనుకాడరని విశ్వసిస్తున్నాను?" అన్నది రాణి ఆవేశంగా

"అక్షరాలా నిజం తల్లీ! మీ ఆజ్ఞను శిరసావహిస్తాము!" అని సభికులందరూ ముక్తకంఠంతో ఘోషించారు.

"మాతృభూమికి అవమానమా? మరణమా? అన్నప్పుడు మనం మరణానికే సిద్ధం కావాలి!" అన్నది లక్ష్మీబాయి మరింత ఆవేశంతో.

"దానిని మా భాగ్యంగా భావిస్తున్నాము తల్లీ!" అన్నారు సభికులు ఆనందంగా.

ఝాన్సీ ఎంతోకాలం ఎదురు చూడవలసిన అవసరం లేకపోయింది. పక్షం రోజులలో శత్రుసేనల జాడ కనిపించింది. ఝాన్సీ సేనలు కోట లోపలి శిబిరాల నుంచి కోట ముందు గుమిగూడాయి. రాణి మేడ



ఉపరితలం నుంచి సైనికులనుద్దేశించి ప్రసంగించి, సైనికుడి ఉడుపులు ధరించి గుర్రాన్ని అధిరోహించి శరవేగంతో ముందుకు ఉరికింది. సైనికులు జయజయ ధ్వానాలు చేస్తూ ఆమె వెంట బయలుదేరారు.

ఆ రోజంతా భయంకరంగా యుద్ధం జరిగింది. సాయంకాలమయింది. యుద్ధ రంగంలో రేగిన ధూళికి అస్తమిస్తూన్న సూర్యబింబం కూడా కనిపించలేదు. ధూళి మేఘాలు పలచబడ్డాక చూస్తే శత్రువులు వెనకడుగు వేసినట్టు తెలియవచ్చింది.

"మా తల్లి రాణి లక్ష్మీబాయి వర్థిల్లాలి!" అంటూ వేలాది మంది సైనికులూ, ప్రజలూ నినాదాలు చేశారు.

రాణి భవనానికి తిరిగి వెళ్ళి, తన శయన మందిరానికి చేరింది. రత్నాలు పొదిగిన తల్పం మీద తన దత్తపుత్రుడు నిద్రిస్తూ కనిపించాడు. పరిచారిక తన వెంట తెచ్చిన దీపకాంతిలో రాణి బిడ్డ ప్రశాంత వదనాన్ని కొంతసేపు తదేకంగా పరికించింది.

ఆ తరవాత ఆమె గాయపడ్డ సైనికుల దగ్గరికి వెళ్ళి వాళ్ళకు సరైన చికిత్స జరిగేలా చూసింది. ఆ తరవాత ఆమె గాయపడ్డ గుర్రాల దగ్గరికి వెళ్ళి, అశ్వభటుల ద్వారా వాటి స్థితిని తెలుసుకున్నది. తెల్లవారేదాకా కంటి మీద రెప్పవేయలేదు!

సూర్యోదయం కాగానే మళ్ళీ యుద్ధం ఆరంభమయింది. ఇప్పుడు ఝాన్సీ సైనికులు కేవలం ఖడ్గాలనూ, తుపాకులనూ మాత్రమే కాకుండా ఫిరంగులను ఎదుర్కోవలసి వచ్చింది. శత్రుపక్షంలో వందలాది మంది మరణించారు. సూర్యాస్తమయమై బాగా రాత్రి అయ్యే వరకు యుద్ధం కొనసాగింది. హఠాత్తుగా ఆకాశంలో భయంకరమైన మంట కనిపించింది. సరిగ్గా అర్ధరాత్రి సమయంలో రాజభవనం నుంచి పేల్చబడిన ఫిరంగి గుండు సర్ హగ్ రోజ్ ప్రధాన సైనికాధికారిని హతమార్చింది!

"భగవంతుడా! రాణి స్వయంగా కాల్పులు జరిపిస్తున్నది!" అని కేకపెట్టాడు సేనాధిపతి.

ఈ పరిణామానికి సర్ హగ్ రోజ్ దిగ్భ్రాంతి చెంది, కొంతసేపటికి తేరుకుని తన యుద్ధవ్యూహాన్ని మార్చాడు.

మరునాడు నగర రక్షకులతో సైన్యంలో నగం పోరాడుతూ, మిగతా సగం రాజభవనం తూర్పు వైపుకు చేరింది. ఆ సంగతి ఝాన్సీ సైనికాధికారులెవరూ గమనించలేదు. రాజభవనం యొక్క

ప్రధాన ద్వారాన్ని పరిరక్షించడంలోనే ఝాన్సీ సేనలు నిమగ్నమయ్యాయి.

హఠాత్తుగా భూమి దద్దరిల్లే ధ్వని వినిపించింది. రాజభవనం తూర్పు భాగం అగ్ని పర్వతం లాగా బద్దలయింది. రాయిరప్పలు ఆకాశంలోకి ఎగిరాయి. చెవులను బద్దలు చేసే ధ్వనులు చాలాసేపు కొనసాగాయి.

తుపాకీ మందుగుండు సామగ్రి వున్న గిడ్డంగిని శత్రువులు ఫిరంగులతో పేల్చివేశారు. తమ సైన్యంలో వున్న స్థానిక సైనికాధికారులకు లంచమిచ్చి మందు గుండు సామగ్రి అక్కడ వున్న రహస్యాన్ని తెలుసుకున్నారు. బ్రహ్మాండమైన మర్రి వృక్షం, కొన్ని చింతచెట్లు మంటలపాలై కొంతసేపటికి మోడులుగా మారిపోయాయి. చాలామంది ప్రాణాలు కోల్పోయారు.

ఝాన్సీ సేనలు ఒకవైపు పోరాటాన్ని కొనసాగిస్తున్నప్పటికీ రాజభవనంలో విషాదఛాయలు అలుముకున్నాయి. అంతలోనే ఒక శుభవార్త కూడా అందింది. నానాసాహెబ్ వద్ద ప్రధాన సేనా నాయకుడుగా పనిచేసిన తాంతియాతోపే రాణిగారి రక్షణకు వస్తున్నట్టు వార్త అందింది.

క్రమక్రమంగా బ్రిటిష్ సేనలు రాజభవనాన్ని సమీపించాయి. కాని లోపలికి జొరబడలేకపోయాయి. ఫిరంగి గుండ్లకు గురైన శిథిల భవనానికి కూడా రాత్రికి రాత్రే కట్టుదిట్టమైన గట్టి కాపలా ఏర్పాటు చేయబడింది. బ్రిటిష్ సైనికులు పెద్దపెద్ద నిచ్చెనలతో వచ్చారు. డిక్, మైఖేల్ జాన్, నోనస్, ఫాక్స్ అనే నలుగురు బ్రిటిష్ సైనికాధికారులు మొదట నిచ్చెనల పైకి ఎక్కారు. కాని మరుక్షణమే తుపాకీ గుళ్ళకు బలై పిట్టల్లాగా కిందపడి పోయారు!

శత్రుసేనలు పక్కకు తిరిగి బాటగుండా ప్రధాన ద్వారం కేసి అడుగు వేయగానే బాకా మోత వినిపించింది. మరుక్షణమే గోడలపై నుంచి కోట బురుజులపై నుంచి ఫిరంగి గుండ్లు వాళ్ళపై నిప్పుల వర్షం కురిపించాయి. అది ఒక అగ్ని జ్వాలలా ప్రజ్వలిం చింది. భయానక శబ్దాల మధ్య ఏర్పడిన గందరగోళంలో శత్రు సేనల మీదికి రక రకాల మారణ ఆయుధాలు ప్రయోగించబడ్డాయి. ఆ సమయంలో వాళ్ళ కుడివైపు నుంచి, బ్రిటిష్ సేనలను వెనుదిరగమని బాకా మోత వినిపించింది! —(ఇంకావుంది)





# మాట్లాడే పండ

ఒక రాజుగారి వద్ద లెక్కలేనన్ని ఆవులు ఉండేవి. రోజూ పశువుల కాపర్లు ఆవులను కొండ ప్రాంతంలో వున్న పచ్చికబీళ్ళకు తోలుకొని వెళ్ళేవారు. కాని సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేసరికి వాటి సంఖ్య తగ్గి ఉండేది. రాజుగారు ఎంత గట్టి కాపలాలు ఉంచినా ఆవులు మాయమవడం మాత్రం మానలేదు. మాయమవుతున్న ఆవుల ఆచూకీ తెలుసుకుని రమ్మని రాజుగారు తన ముగ్గురు కొడుకులనూ పంపాడు.

రాజకుమారులు ఒక రోజల్లా ప్రయాణం చేసి ఒక అరణ్యం చేరుకున్నారు. అక్కడ వాళ్లకు ఒక వికారాకారం గల స్త్రీ ఎదురుపడి, "నాయనలారా, ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగింది.

అందుకు రాజకుమారులు విసుక్కుని, "మేము ఎక్కడికి వెళితే నీకేం? నీ దారిన నువ్వు వెళ్ళు!" అన్నారు.

ఆ స్త్రీ ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయింది. రాజకుమారులు ముందుకు నడిచి, చీకటి పడే వేళకు ఒక కోటను చేరుకున్నారు. కోట లోపల తమ ఆవులన్నీ కట్టివేసి ఉండటం వారికి కనిపించింది. ఇంకా లోపలికి పోగా, నిద్రపోతున్న అతి ముసలి రాక్షసి కనిపించింది. వారి అలికిడికి ఆ రాక్షసి మేలుకున్నది.

రాజకుమారులు, "అవ్వా, మాకేదన్నా పని ఇప్పించు. ఇక్కడే ఉంటాం," అన్నారు.

వాళ్ళు ఆవుల కోసమే వచ్చారని రాక్షసి గ్రహించింది. అది చాలా జిత్తుల మారిది. తన ఒంట్లో శక్తి ఉడిగిపోయాక తన మాయోపాయాల చేతనే తన శత్రువులను చంపుతూ వస్తున్నది. అది రాజకుమారులను కూడా అలాగే చంప నిశ్చయించుకుని, "సరే, అబ్బాయిలూ! ఆ ఆవులను పాలుపిండే వేళ అయింది. వెళ్ళి పాలు

పెతుక్కు రండి. రేపటినుంచీ నా ఆవుల పాలనా, పోషణా అంతా మీదే," అన్నది.

రాజకుమారులు సరేనని వెళ్ళి, గంగాళాల నిండా పాలు పితుక్కుని వచ్చారు.

రాక్షసి పాలను కాచి వాళ్ళను పిలిచి, "అబ్బాయిలూ, ఆకలితో ఉన్నారేమో, ముందు ఈ పాలు తాగండి," అని మూడు పాత్రలలో విషం కలిపిన పాలు ఇచ్చింది. రాజకుమారులు ఆ సంగతి ఎరగక, పాలు తాగి మరణించారు. రాక్షసి ఆ ముగ్గురినీ పెట్టెలో దాచింది.

తన కొడుకులు ఎన్నాళ్ళకూ తిరిగి రాకపోయేసరికి రాజుగారికి దిగులు పట్టుకున్నది. రాజుగారి పశువులకాపర్లలో గోవిందుడనే యువకుడు ఉండేవాడు. వాడు ధైర్యం చేసి రాజుగారి వద్దకు వెళ్ళి, రాజకుమారుల జాడా, మాయమైన ఆవుల జాడా కనుక్కువస్తానన్నాడు. రాజుగారు సరేనన్నాడు.

గోవిందుడు కూడా రాజకుమారులు వెళ్ళిన దారినే బయలుదేరాడు. వాడికి కూడా వికారాకారం గల స్త్రీ కనిపించి, "నాయనా, ఎక్కడికి వెళుతున్నావు?" అని అడిగింది.

గోవిందుడామెకు తను వెళుతున్న పని గురించి చెప్పాడు.

అందుకామె, "ఇంకా కొంత దూరం వెళ్ళావంటే నీకొక కోట కనిపిస్తుంది. అందులో ఒక జిత్తులమారి ముసలిరాక్షసి ఉన్నది. నా చెల్లెలి సహాయంతో అదే మీ రాజుగారి ఆవులను కాజేసింది. అవసరం తీరినాక అది నా చెల్లెల్ని చంపేసింది. ఈపాటి కది మీ రాజుగారి కొడుకులను కూడా చంపే ఉంటుంది. వాళ్ళకి ఈ విషయం ముందే చెబుదామనుకున్నాను



గాని, పలకరిస్తే నా మీద చిరాకుపడి వాళ్ళు వెళ్ళిపోయారు," అన్నది.

గోవిందుడు ఆమెతో, "నీ చెల్లెలు ఎవరు? ఆ రాక్షసికి మా ఆవులను కాజెయ్యాల్సిన అవసరమేమిటి?" అన్నాడు.

అందుకామె, "ఆ రాక్షసికి ముసలి వయసులో పొట్టగడవటం కష్టమయింది. మీ రాజుగారి ఆవుల మీద దాని కన్ను పడ్డది. మా చెల్లెలు ఒక మంత్రగత్తె. ఆ రాక్షసి మా చెల్లెలితో మెల్లగా స్నేహం చేసింది. రాజుగారి ఆవుల్లో సగం వాటా ఇస్తానని చెప్పి, మా చెల్లెలి సహాయంతో ఆవులను మాయం చేయించి తన కోటకు చేర్పించుకున్నది. అవసరం తీరాక అది మా చెల్లెల్ని చంపేసింది. అన్యాయంగా మా చెల్లెల్ని చంపినందుకు నాకా రాక్షసి




మీద చాలా కసిగా ఉన్నది. నేనా ముసలి దాన్ని, నా మంత్రశక్తులా ఏనాడో పోయాయి. నీలాటి వాళ్ళు కనిపిస్తే వాళ్ళ సహాయంతో రాక్షసి మీద పగ తీర్చుకుందామని చూస్తున్నాను," అన్నది.

అంతా విని గోవిందుడు, "ఆ రాక్షసి బారి నుంచి రాజకుమారులనూ, మా ఆవులనూ కాపాడుకునే మార్గం ఉంటే చెప్పు," అన్నాడు.

"మంత్రశక్తులు పోయినా నా దగ్గిర ఇంకా రెండు వస్తువులు మిగిలి ఉన్నాయి," అంటూ ఒక పండూ, మూడు రాళ్ళూ గోవిందుడి చేతిలో పెట్టి, ఆ వికారాకారం గల స్త్రీ, "ఈ పండు నీకు రాబోయే అపాయం గురించి ముందే చెబుతుంది. ఇది మాట్లాడే పండు. దీనితో నీ అవసరం తీరిపోయాక ఈ పండులోని విత్తు తీసి, నీటిలో అరగదీసి చనిపోయిన వారిమీద చల్లితే వాళ్ళు తిరిగి బతుకుతారు. ఈ రాళ్ళు కింద వేసి ఏమి కావాలంటే అది అవుతాయి. నువ్వు రాక్షసిని చంపుతావని నాకు నమ్మకం ఉంది. వెళ్ళిరా, నాయనా!" అన్నది.

ఆమె ఇచ్చిన వస్తువులను తీసుకుని గోవిందుడు కోటకేసి బయలుదేరాడు. కోటను చేరుకుని, ముసలి రాక్షసిని చూసి, గోవిందుడు తన కేదన్నా పని ఇప్పించమన్నాడు. వీడు కూడా ఆవుల కోసమే వచ్చాడని పసికట్టి రాక్షసి, "సరే, నా ఆవులను చూసుకుంటూ ఉండు," అని లోపలికి వెళ్ళి పాలు తెచ్చి, ఎంతో ఆప్యాయంగా వాణ్ణి తాగమన్నది.

"తాగకు! అందులో విషం ఉన్నది!" అని పండు గోవిందుణ్ణి హెచ్చరించింది.

రాక్షసి కన్ను కప్పి గోవిందుడాపాలను అవతల పారబోశాడు. పాలు తాగి కూడా గోవిందుడు బతికే ఉన్నందుకు రాక్షసి ఆశ్చర్యపోయి, "అక్కడ పడక ఉన్నది. వెళ్ళి పడుకో. చాలా పొద్దు పోయింది," అన్నది.

"పడుకోకు. కందకంలో పడతావు," అని పండు గోవిందుణ్ణి హెచ్చరించింది.

రాక్షసి వెళ్ళిపోయాక గోవిందుడు పడక ఎత్తి చూస్తే దాని కింద ముళ్ళకంచెలతో నిండిన లోతైన గొయ్యి కనిపించింది. రెండోసారి తన ప్రాణం దక్కినందుకు గోవిందుడు సంతోషించాడు.

గోవిందుడు రాజకుమారుల కోసం కోట అంతా గాలించాడు. వాడికి రాజకుమారుల శవాలున్న పెట్టె కనబడింది. వికారాకారం గల స్త్రీ చెల్లెలి శవం మాత్రం

కనిపించలేదు. రాజకుమారుల శవాలను మోసుకు పోవటం సాధ్యం కాదు. అందుచేత వాడు ఇక తనకు పండు అవసరం ఉండదని నిశ్చయించుకుని, దాని విత్తనం తీసి నీటిలో అరగదీసి, ఆ నీళ్ళు రాజకుమారులపై చల్లాడు. వాళ్ళు వెంటనే బతికి, గోవిందుణ్ణి గుర్తుపట్టారు.

తరవాత నలుగురూ కలిసి పశువుల కొట్టానికి వెళ్ళి, పశువులను విడిపించి, వాటిని తోలుకుంటూ కోట దాటారు. గోవిందుడు వికారాకారం గల స్త్రీ కోసం చూశాడు గాని ఆమె ఎక్కడా కనిపించలేదు.

ఈలోగా రాక్షసి లేచి, గోవిందుడి పక్క చెక్కుచెదరకుండా ఉండటం గమనించి, అనుమానం వచ్చి పశువుల కొట్టంకేసి వెళ్ళింది. పశువులు లేవు. గోవిందుడు వాటిని విడిపించుకు వెళ్ళాడని గ్రహించి, పెడబొబ్బలు పెట్టుకుంటూ వచ్చింది.

రాజకుమారులు, గోవిందుడు రాక్షసి అరుపులు విన్నారు. అది పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ సమీపిస్తున్నది. గోవిందుడికి తన వద్ద ఉన్న రాళ్ళు జ్ఞాపకం వచ్చాయి. వాడొక రాయి తీసి వెనక్కు విసురుతూ, ముళ్ళ కంచెలు అయిపోవాలనుకున్నాడు.

ముళ్ళ కంచెల మధ్య చిక్కుకుపోయిన రాక్షసి అతి ప్రయాసతో వాటిని దాటి మళ్ళీ రాసాగింది. గోవిందుడు మరొక రాయి విసిరాడు. వెంటనే రాక్షసి మంటల మధ్య చిక్కుకున్నది. ఆ మంటలు చల్లారేదాకా రాక్షసి కదలలేకపోయింది. ఈలోపుగా రాజకుమారులూ, గోవిందుడూ చాలా దూరం వెళ్ళారు.

మరొకసారి రాక్షసి తమని సమీపిస్తూ ఉండటం చూసి గోవిందుడు తన వద్ద ఉన్న మూడోరాయి కూడా విసిరాడు. అది ఒక వాగులో పడింది. మరుక్షణమే వాగు పొంగ నారంభించింది. అయినా రాక్షసి వాగులోకి దిగి, దాన్ని దాట యత్నించింది. అయితే ప్రవాహం రానురాను హెచ్చి, అందులో రాక్షసి కొట్టుకుపోయింది.

సాయంకాలానికల్లా గోవిందుడు రాజకుమారులతోనూ, ఆవులతోనూ రాజుగారి ఇల్లు చేరి, జరిగినదంతా రాజు గారికి తెలిపాడు. రాజుగారు సంతోషించి గోవిందుణ్ణి గొప్పగా సత్కరించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100

ఈ పోటీల వ్యాఖ్యలు 1998 మే నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ **మార్చ్ నెల 25వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి.** ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండే వ్యాఖ్యలకు కలిపి) రు. 100లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

**చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్-600 026.**

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **ముచ్చట గొలిపే విన్యాసం !**

రెండవ ఫోటో : **మాటలకందని సహవాసం !!**

పంపినవారు: సి. ప్రణీత

D/o, శ్రీనివాస్ III క్రాస్ రోడ్, రాంజీనగర్, నెల్లూరు - 524 002 (ఆం.ప్ర)


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా:

**డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్-600 026**

Printed by B.V. REDDI at Prasad Process Pvivate Ltd., Chandamama Building, Chennai- 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K.Salai, Vadapalani, Chennai- 600 026 (India). Editor : NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 129.00 ఎయిర్‌మెయిల్ ద్వారా: రూ. 276.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 135.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 276.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026



చురుకైన
పిల్లలకోసం
చురుకైన
పెన్సిల్










**NATARAJ®**

హిందూస్థాన్ పెన్సిల్స్ లిమిటెడ్ వారి ఉత్కృష్ట ఉత్పాదనలు